శ్రీ రామ

భాగవతకథ

# యదువంశము

శ్లో॥ వ్యాసశాస్త్రోప వనతః సుమనాంసి విచిన్వతా,
కృతా వై ప్రభుదత్తేన మాలా భాగవతీ కథా॥


గ్రంథకర్త:

శ్రీ ౧౦౮ ప్రభుదత్త బ్రహ్మచారిగారు

అనువాదకుడు:

శ్రీ రామ్‌శరణ్ కుందుర్తి వేంకట నరసయ్య

సంపాదకుడు, "మోక్షసాధన"



కాపీరైటు] 1970 [వెల: 6-00

సోల్ డిస్ట్రిబ్యూటర్సు:

నటరాజ పబ్లికేషన్సు

ఏలూరు రోడ్ * విజయవాడ-2

# అనువంశీయుడగు ఉశీనర మహారాజు

(౧౯౫)

శ్లో॥ అనోః సభానరశ్చక్షుః పరోక్షశ్చ త్రయః సుతాః।
సభానరాత్కాలనరః సృంజయస్తత్సుతస్తతః।
జనమేజయస్తస్య పుత్రో మహాశాలో మహామనాః॥
ఉశీనరస్తితిక్షుశ్చ మహామనస ఆత్మజౌ॥

శ్రీభాగ. ౯ స్కం ౨౩ అ. ౧.౨ శ్లో.

వ. యయాతి కొడుకనువునకు సభానరుండుఁ జక్షువుఁ బరోక్షుండు ననువారు ముగ్గురు పుట్టిరందు సభానరునికిఁ గాలనాభుండు, కాలనాభునకు సృంజయుండు, సృంజయునకుఁ బురంజయుండు, పురంజయునకు జనమేజయుండు, జనమేజయునకు మహాశాలుండు, మహాశాలునికి మహామనసుండు, మహామనసునకు నుశీనరుండు తితిక్షువను పుత్రులు జన్మించిరి.

శ్రీమదాంధ్ర భాగవతము.

మనుష్య శరీరములో సద్గుణములును నివసించును, దుర్గుణములును నివసించును. తమలో సద్గుణ వికాశమొనర్చు కొనువారు సద్గుణముల పరాకాష్ఠను బొంది ప్రభువును జేరుదురు. దుర్గుణ వికాసమొనర్చుకొనువారు పరాకాష్ఠనుబొంది దుర్గుణములచేతనే ప్రభువును ప్రసన్నునొనర్చుకొందురు. ఈ

వర్ణనపూర్తికొఱకే యీనాల్గింటిని వర్ణింప వలసివచ్చినది. యమునల వర్ణనముగాని, ఇవన్నియు దానికంగములు. దేవయానియొక్క రెండవపుత్రుండగు ననువునకు సభానరుండు, చక్షువు, పరోక్షుండను ముగ్గురు పుత్రులుదయించిరి. వీరిలో సభానరుని పుత్రుండు కాలనరుండు, కాలనరుని పుత్రుండు పర మహాత్ముండగు సంజయుడు సంజయుండను పేర జాలమంది రాజులుండిరి. సంజయునకు జనమేజయుండుదయించెను. జనమేజయునిపుత్రుండు మహాశీలుండు, మహాశీలునకు మహామనుండు, పరమ భాగ్యశాలియగు మహామనునకే జగద్విఖ్యాతుండగు నుశీనరుండుదయించెను. ఉశీనరునికీర్తి ప్రపంచమున నేటికిని వ్యాపించియున్నది. ఈతనికి శరణాగత రక్షణమను గొప్పవ్రతముండెడిది. ఈతని విషయమున నొకచక్కని యితిహాసము కలదు. దీనిచే నీతని శరణాగత వత్సలత ద్యోతకము కాంగలదు. తనసత్యమును స్థిరముగనుంచుటకై యీతండు రాజ్య, ధన, దారాపుత్రాదులను, శరీరమును లెక్కచేయలేదు.

ఒక దినమున ఉశీనరుండు యజ్ఞమండపమునం గూర్చుండి యజ్ఞీయకార్యము లొనర్చుచుండెను. మహారాజు యజ్ఞదీక్షను దీసికొనియుండెను. యజ్ఞదీక్షలో నీతడొక నియమమును బెట్టుకొనెను. యజ్ఞమందేమి కావలసియున్నను దీసికొనవచ్చును. యథేష్టముగ భోజనము చేయవచ్చును. ఏవస్తువు కావలసియున్నను దీసికొనిపోవచ్చును. అచ్చట నెల్ల

వ్యాకులము దండు. భోజనము చేయుడు, ఫలాహారమొనర్పుడు మిఠాయిలు తినుడు. పాలద్రాక్షరసము, క్షీరాన్నము పుచ్చుకొనుడు. అను శబ్దములచే నిండుచుండెడివి. ఎంతయెక్కువమంది యాచకులు వచ్చినను, కొందఱు అతిథులు భోజనమొనర్చిన రాజునకంతటి అధికసంతోషము.

ఒక దినమున రాజు తన సభాసదులతో యజ్ఞమండప సమ్ముఖమున నొకయరుగు మీఁదఁగూర్చుండి యేదో ధర్మచర్చను జరుపుచుండెను. సరిగా నామధ్యమున నాకాశము నుండి మెరయుచు నొకపావురము గబగబవచ్చి రాజువడిలో బడెను. దీనినిఁగాంచి యందఱును బరమవిస్మితులైరి. పావురము భయపీడితమై యుండెను. అది యెగిరెగిరి అలసియుండెను. భయముచే రాజువడిలో వణకుచుండెను. రాజునకు దానిమీఁద దయకలిగెను. అతఁడు దానిశరీరముమీఁదఁ జేతిని నిమురుచు బుజ్జగించుచుండెను.

ఇంతలోనే తీక్ష్ణమగు ముక్కుతోడను, భయంకరమగు కన్నులతోడను నొకడేగవచ్చి రాజు సమ్ముఖమున నిర్భయముగఁగూర్చుండి, మానవవాక్కులతో నిట్లనెను:— "రాజా! ఇది నా యాహారము. దీని నీవేల దాచితివి? దీనిని నాకొసంగుము"

రాజును, సభాసదులును బక్షినోట మానవవాక్కులను విని పరమవిస్మితులైరి. రాజు దానివైపుచూచి యిట్లనెను:—

బుద్ధిగలంతేఁడనని చెప్పుకొనుమానవుఁడు చేఁపలను దినును. ఎన్నోకేఁకలను మెక్కును నీపీయజ్ఞములో నెన్నో జంతువులను బలియిచ్చుచున్నావు"

రాజిట్లనెనుః- "నాయనా! పశువుల సంగతి వేఱు నేను మానవుఁడను. నేనొకదానిని బ్రతికింపఁజాలనప్పుడు నాకు దేనినిఁ జంపుటకధికారములేదు. శరణమునకు నచ్చినవారిని రక్షించుట నాధర్మము. నీవు నాకార్యమందు నాకు సహాయ మొనర్పవలయును."

డేగ యిట్లనెనుః- "రాజా! పొట్టనిండిన తరువాతనే ధర్మము. ఆఁకలితో భజనము జరుగదు. నీవు హింసనుండి తప్పించుకొంటివా? నీవు ఫలములను దినుచున్నావే, దానిలో జీవులు లేవా? అవియును పెరుగుచున్నవిగదా! వానికినిఁగష్టము కలిగియుండవచ్చును. నీవు పచ్చికూరలను దినుచున్నావే? దానిలో జీవులులేవా? నీవన్నమును దినుచున్నావే? అదినిర్జీవమైనదా? జీవములేకున్నచో దానినుండి అంకుర మెట్లువచ్చుచున్నది? మేమొకటి రెండుజీవులనే చంపుచున్నాము. నీవో అసంఖ్యాకములగు జీవులను జంపుచున్నావు,'

రాజిట్లనెనుః- "నాయనా! అది నివిశత అన్నము దినకుండు టెట్లు? పనులెట్లు జరుగఁగలవు.?

డేగ శీఘ్రముగ నిట్లనెను:- "అంతే మహారాజా! నా నిమిత్తమునకు సృష్టియనుకొనెను. దీనిఁ దినకున్న నేనెట్లు బ్రతుకఁగలను? కావున మహారాజా! నీవు మోహమును విడుము. ఆకలి చెందియున్న నాకాహారము నొసంగి పరమ పుణ్యాత్ముడవు కమ్ము. నా యాహారమును దొంగిలించి పాపభాగివి కాకుము. దీనినిఁ జంపి నేను మాత్రమే తినను. నా పిల్లలకును పెట్టెదను. మహారాజా! ధర్మగతి అతిసూక్ష్మమైనది. ఏ ధర్మానుష్ఠానమువలన నితరుల ధర్మమునకు బాధాతము కలుగునో అది ధర్మము కాదు, కుధర్మము. అవిరుద్ధ ధర్మమే యథార్థమగు ధర్మము"

రాజిట్లనెను:- "కొంత ధర్మములు పరస్పరవిరుద్ధములైనప్పుడేమి చేయవలెను?"

డేగ యిట్లనెను:- "మహారాజా! అచ్చట బలాబలములను జూడవలెను. అధిక బాధకలుగుదానిని, నెక్కువమందికి అకల్యాణము కలుగుదానిని వదలి, న్యూనతమాఘాతము కల దాని నాచరింపవలయును. ఈ పక్షిని వదలినచోఁ గేవలము నీవు నన్నుఖిన్నమగును. మాకో మా పరివారముయొక్క ప్రాణములన్నియును బోవును. కావున నీవు దీనిని నాకీయవలయును."

రాజిట్లనెను:- మంచిది, ఒక్క పనిఁ జేయుము, నీకీపావురముమీఁద ద్వేషమేమియును లేదుకదా! నీ కాహారముకావ

మును రక్షించి తీరెదను. దీనికి బదులుగా నీవు నన్నేది యడిగిన దానినొసంగెదను."

డేగ యిట్లనెను:- "మహారాజా! సరియే. నీకీ పావురముమీఁద నింతటి ప్రేమయుండి, యేకథముగను దీని కొఱకు గల కష్టము లేకున్నచో నొక్కపనిఁ జెప్పెదను. ఈ పావురము తూకమంతటి మాంసమును నీశరీరమునుండి కోసియిమ్ము. దానిచేతనైన నేను ప్రసన్నుఁడనగుదును."

ఇది విని అత్యంతానందమును బ్రకటించుచు మిక్కిలి యుల్లాసముతో రాజిట్లనెను:- "పక్షిరాజా! నీవు నాపైఁగృపను జూపితివి. నాశరీరమిట్టి చక్కని కార్యమునకు వినియోగపడుట నాకది పరమసౌభాగ్యమని భావించుచున్నాను." అని పలికి మహారాజొక్క పెద్దత్రాసును దెప్పించెను. ఒక ప్రక్క నాతఁడు పావురమునుంచెను. రెండవవైపునందున శరీర మాంసమునుంచెను. కాని మాంసము తేలికగనుండెను. పావురమున్నత్రాసు బరువుగ నుండెను. అప్పుడు రాజింక కొంత మాంసమును గోసియుంచెను. అయినను సరిపోలేదు. రాజత్యంతోత్సాహముతో మాటిమాటికిని శరీరమును గోసి మాంసమునుంచుచుండెను. కాని పావురమున్న త్రాసు నేలమీఁదనుండి పైకిలేవనేలేదు తన శరీరమున నింక మాంసము లేదని రాజు తెలిసికొని, తాను స్వయముగ నాత్రాసులోనికిఁ బోయి కూర్చుండెను

అంతఁ గౌశికుఁడిట్లనెను:- "సూతా! నేఁటికిని సజరా మహారాజులకు శిబిచక్రవర్తియందేమి గుణములకును? మహాభారతాది గ్రంథములలో మాటిమాటికీతని యశోగాన మొనర్పఁబడినది. అప్పటప్పట నీతని యుపాఖ్యానములకు గౌరవ మాపాదింపఁబడినది."

అంతట సూతుఁడిట్లనెను:- "స్వామీ! రాజర్షి యగు శిబి యందన్నియు నలౌకిక గుణములే సద్గుణములన్నిటికి నాతఁడు భాండారము. కాని ఆతనికున్న ధైర్యము ప్రపంచమున నింకెవనికిఁ గనఁబడదు. ఆతని ధైర్యమునాకిరము దాఁకొట్టుటకాతఁడు ప్రయత్నము చేయవలసిన పనిలేదు. ఎట్టి గొప్ప సంఘటనలు సంభవించినను నాతఁడు విచలితుఁడు కాకుండుట ఆతనికి స్వాభావికమైనది. ఎట్టి అనుకూల, ప్రతికూల సంఘటనలు సంభవించినను నాతని ధైర్యము సడలలేదు స్వామీ! గృహారామ దారాపుత్రాదులందు మిక్కిలి యాసక్తి కలిగి, మానవుఁడు అవి నశించినఁదానే నశించినట్లు భావించుచుండును. ఇది భగవానుని గుణమయమగు దైవీమాయా ప్రభావము. శిబి చక్రవర్తి తన ధైర్యముచే నీమాయను దాటినాఁడు. ఆతనికి సత్యానందము నిష్ఠకలదు. ఆతఁడు జ్ఞానముతోఁ జాటు సర్వస్వమును హోమము మొనర్పుటకు సిద్ధపడినాఁడు."

అది విని శౌనకుఁడిట్లనెను:- "సూతా! ఉశీనరకుమారుఁడైన శిబిచక్రవర్తి చరిత్రమును గూర్చిన కథను మాకవశ్యము చెప్పవలయును. ఈకథాశ్రవణముచే నంతఃకరణము శుద్ధము కాఁగలదు. ధర్మమునందుఁ బ్రవృత్తి కలుగఁగలదు."

సూతుఁడిట్లనెను:- "మంచిది. స్వామీ! ఇప్పుడు నేను శిబిచక్రవర్తి కథను చెప్పఁగలను. కాని ఇఁక నేను తొందఱ పడవలయును. కావున సంక్షేపముగనే దానిఁ జెప్పెదను. మీరందఱును విద్వాంసులు కావున మీకుమీరే దానిని విస్తారముగా భావించుకొనఁగలరు."



# ఉశీనరనందనుఁడు శిబిచక్రవర్తి

(౧౯౬)

శ్లో॥ శిబిర్వరః కృమిర్దక్షశ్చత్వారోశీనరాత్మజాః ।
వృషాదర్భః సువీరశ్చ మద్రః కైకేయ ఆత్మజాః ॥

శ్రీభాగ. ౯ స్కం. ౨౩ అ. ౩ శ్లో॥

వ. అందు నుశీనరునకు శిబి వరకృమిదక్షులన నలువురుపుట్టిరందు శిబికి వృషాదర్భ సువీర మద్రి కేకయులు నలువురు పుట్టిరి.

శ్రీమదాంధ్ర భాగవతము.

స్వల్పవస్తువును త్యాగమొనర్పక మహద్వస్తువు ప్రాప్తింపదు. త్యాగము వలననే వస్తువు వృద్ధియగును. కృషీకుఁడు ముందుగా గింజలను మట్టిలోఁ గలుపును అనఁగా వానిని త్యజించును. అప్పుడాతనికొక గింజకు బదులుగాఁజాలగింజలు లభించును. వ్యాపారి ముందుగాఁదన దగ్గఱనున్న ద్రవ్యమును వెచ్చించును. అప్పుడాతనికి లాభము కలుగును. పరదేశవ్యాపారి అగాధ జలముయొక్క వక్షఃస్థలమును జీల్చుకొని యితరదేశములకుఁబోవును తనరక్తమును జెమటగ వెలువఱచును అప్పుడాతనికి లభించును. కాముకుఁడు కామినికొఱకు ప్రియాతి

సూతుండిట్లనెను:- "మునులారా! ఇప్పుడు నేను ఉశీనరదేశమునకు రాజగు శిబిచక్రవర్తియొక్క పావన కథను చెప్పెదను. ఈతండు పుట్టియెన్నో యుగములైనను నేటికిని ప్రపంచమందు మహాప్రకాశముగ నున్నది. గంగ, యమున, హిమాలయము, సూర్యచంద్రులు, ఈసృష్టి యున్నంతవఱకుండుఁ గలదు శిబిచక్రవర్తి తన పుణ్యకర్మలచే సమస్త దివ్యలోకములను జయించెను భూలోకమందలి సమస్త రాజ్యములను తన బాహుబలముచే జయించి, సపత్నజిత్తను బిరుదమును బొందెను. ఆతండు చేసిన యజ్ఞములకును, పుణ్యకర్మలకును దానములకును లెక్కయే లేదు. పృథివియొక్క రజఃకణములను మేఘములోని బిందువులను, ఆకాశములోని తారాగణమును, నక్షత్రములను. సమస్త జీవులయొక్క రోమములను, సప్తసముద్రములలోని జలబిందువులనైన లెక్కింపవచ్చును గాని శిబిచక్రవర్తి బ్రాహ్మణుల కెన్ని గోవుల నిచ్చినదియు, ఎన్ని సువర్ణముద్రల నిచ్చినదియు లెక్కించుట మిక్కిలి కఠినము ఆతఁడు చేసినన్ని యజ్ఞములు ప్రజాపతులు తప్ప ఇంకెవరును జేసియుండరు సముద్రములో నెన్ని జీవజంతువులు నివసించునో అన్నిగోవుల నాతండు దానము గావించెను ఆతని యజ్ఞములలో రండు, స్నానమొనర్పుడు, తినుడు. తీసికొనిపొండను శబ్దములే వినఁబడుచుండెడివి. ఆతని యుదారతకు సంతసించి సదాశివుండాతని

బ్రాహ్మణుఁడిట్లనెను:- "రాజా! నేనాఁకలిచేఁ జచ్చు
చున్నాను. ఆహారము కొఱకై నీకడకు వచ్చితిని"

రాజత్యంత సమ్మతితో నిట్లనెను:- "ప్రభూ! నావద్ద
షడ్రసోపేతములగు నేఁబదియాఱు (56) వ్యంజనములు కలవు.
మీ రెట్లు భోజనము చేయుదురో ఆజ్ఞాపింపుఁడు"

బ్రాహ్మణుఁడిట్లనెను:- నాకట్టి భోజనమక్కఱలేదు.
నేనొక క్రొత్త సంప్రదాయము నవలంబించినవాఁడను. నాకు మాంస
భోజనమొసంగుము."

రాజు కైక్యముతో నిట్లనెను:- "మాంసమును సిద్ధముగ
నున్నది మృగమాంసమా, శూకరమాంసమా, శశకమాం
సమా, అజాదిజంతువుల మాంసమా? మీ కేమాంసము
కావలయునో చెప్పుఁడు."

బ్రాహ్మణుఁడిట్లనెను:- "రాజా! వీనిలో నేమాంస
మును నాకిష్టము లేదు. నాకు నరమాంసము కావలయును."

రాజిట్లనెను:- "వధశాలలో నరమాంసమును దొఱకఁ
గలదు."

బ్రాహ్మణుఁడిట్లనెను:- "అట్టి నరమాంసము నాక
క్కఱలేదు నేను రాజపుత్రుని మాంసమును దినెదను. నీవు నీ

నేనేకపుత్రుని స్వయముగఁ జంపి, మాంసమును వండి తెచ్చిన యెడల దానిని నేను దిని తృప్తుఁడనయ్యెదను.''

రాజుమిక్కిలి యానందమును బ్రకటించుచు నిట్లనెను: "స్వామీ! నాయదృష్టము, నాపుత్రుని యదృష్టము. నేఁడాతఁడు రాజకులమునఁ బుట్టినందులకు సార్థకతను బొందినాఁడు. ఆతని శరీరమతిథిసేవకు వినియోగపడుట యదృష్టము. స్వామీ! దీని ద్వారా ధర్మోపార్జన మొనర్చుటయే యీ మాంసాస్థియుక్తమగు శరీరమున కేకైక ఫలము. ఈమానవ దేహముచేఁ గైతవరహిత ధర్మోపార్జనము జరుగుచో నీశరీర మొకరోజు జీవించినను ధన్యతయే. దీనికి విపరీతముగఁ జక్కని స్వాదిష్ట పదార్థములను దినుచు, మాంసమును బెంచుచు, వానివలన మలమును బెంచుచుఁ బావనభూమిని నపావన మొనర్చుచుందురు. ఇట్టి శిశ్నోదర పరాయణులగు బురుషులు కల్పమువఱకు జీవించిన నేమిలాభము స్వామీ! మీరిచ్చట కూర్చుండుఁడు. నేనిప్పుడే నాపుత్రుని మాంసమును వండి తెచ్చెదను.'' అనిపలికి రాజచ్చటనే బ్రాహ్మణునిఁ గూర్చుండఁ బెట్టి అంతఃపురము లోనికిఁ బోయెను. అచ్చటనాతఁడు తన రాజకుమారుఁడగు వృషాదర్భుని తనచేతులతోఁ గోసి మాంసమును దన చేతులతో వండెను.''

సూతుఁడిట్లనెను:— "స్వామీ! మీరు దీనికాశ్చర్యము చెందకుఁడు సత్యవ్రతమును స్వీకరించినవారికి స్త్రీ, ధన,

ప్రాణములకత్యంత తుచ్ఛ పదార్థములు. అట్టివారికి తన పుత్రి నకును, మేకపిల్లలకును భేదముండదు. మనము మాయాచక్ర మునఁబడి మోహావశమున ఆసక్తివశమున నొకనిని మనవా నిఁగాఁదలఁతుము, మఱియొకని పరాయివానిఁగాఁ దలఁతుము కాని సన్నిష్టావంతులగువారు సమస్తమును ప్రభుసేవోప కర ణములుగఁ దలఁచుచుందురు భగవానుఁడొసంగినది భగవం తునకును, భాగవతులకును వినియోగించుట నిమిత్తమే. స్వామీ! ఒక యాచార్యుఁడుండెను ఆతనికొక నిమ్నఁలిగిన శూద్రశిష్యుఁడుండెను. ఆచార్యుఁడాతనిని మిక్కిలి ప్రేమించు చుండెను. ఆచార్యుఁడు కొంచెము వృద్ధుఁడయ్యెను. అందు వలన నాతఁడాతని భుజముపైఁ జేయివైచి పోవుచుండెడివాఁడు దీనివలన నాతని ఉచ్చజాతిశిష్యులు లోలోనఁ గుళ్ళుకొనెడు వారు. సర్వజ్ఞుఁడగు నాచార్యుఁడు వారి మనస్సులోని భావ ములను గ్రహించెను. గురువుచేఁ బ్రేమింపఁబడు నాశూద్రున కొక యుపపత్నియుండెను. ఆతఁడామెను మిక్కిలి ప్రేమిం చెడువాఁడు. ఒకనాఁడాచార్యుఁడితర భాగవతోత్తములతో నిట్లనెను:— "రాత్రియందీ శూద్రభక్తుని యుపపత్ని నిద్రించు నప్పుడు మీరందఱును బోయి, ఆమె శరీరముమీఁదఁగల ఆభరణములను దీసికొనిరండు."

ఆచార్యుని యీ యాజ్ఞ ననుసరించి ఆన్యశిష్యులత్యంత హర్షమును జెందిరి. ఆశూద్రభక్తుఁడింట లేఁడు. ఆతనిభార్య

నిద్రించుచుండెను. నిద్రయెక్కడిది? కన్నులు మూసుకొని, ఒక ప్రక్కకు వత్తిగిలి పరుండియుండెను. ఆచార్యుని యాజ్ఞచే నా భాగవతులందరును బోయిరి వారు మెల్లమెల్లఁగా నామె శరీరమునుండి బహుమూల్యములగు నాభరణములను వలుచుకొనిరి. ఒక ప్రక్క ఆభరణముల నన్నిటికి వలుచుకొనుట పూర్తి కాఁగానే ఆమె యింకొకప్రక్కకు వత్తిగిలెను. ఆమె మేలుకొన్నదని శిష్యులనుకొని వెంటనే పారిపోయిరి. భక్తుఁడింటికివచ్చి తన భార్యనిట్లడిగెను:— నీశరీరముపై నొకప్రక్క నున్న ఆభరణము లేమైనవి?"

ఆమె యిట్లనెను:— "కొందఱు వైష్ణవ భాగవతులు వచ్చిరి. వారు నాశరీరము మీఁది ఆభరణములను వలుచుకొని కొనిపోయిరి."

అత్యంతానందముతో భక్తుఁడిట్లనెను:— "అయితే వారు రెండవప్రక్క ఆభరణముల నేలవిడచి పోయినారు?"

భార్యయిట్లనెను:— "నేను వత్తిగిలితిని. అప్పుడు వారు పారిపోయిరి."

కనుక భక్తుఁడిట్లడిగెను:— "నీవేల వత్తిగిలితివి?"

భార్యయిట్లనెను:— "ప్రాణనాథా! రెండవప్రక్క ఆభరణములనుగూడ వైష్ణవులు వలుచుకొందురు గదాయని నేను వత్తిగిలితిని."

సూతుఁడిట్లనెను:- "స్వామీ! అట్లుండుట మిక్కిలి కష్టమే. ఇతిహాసమందు హరిశ్చంద్ర, దధీచి, శిబి మొదలగు వారి దృష్టాంతములు కలవు. ఆతఁడు తనపుత్రుని మాంసమును వండి తెచ్చెను. కాని బ్రాహ్మణుని గూర్చుండఁబెట్టిన చోట బ్రాహ్మణుఁడు లేఁడు. అత్యంతశంకిత చిత్తముతో వండిన పుత్రుని మాంసమును శిరముపై నిడుకొని రాజా యతిథియగు ద్విజుని నటునిటు వెదుకసాగెను. కాని అతని జాడదొరక కుండెను. ఇంతలోనే ఒక రాజభటుఁడు వచ్చి యిట్లనెను:- "ప్రభూ! రాజకుమారుని మాంసమునడిగిన బ్రాహ్మణుఁడు మీకు వచ్చుట ఆలస్యమైనదని రాజభవనమునకును, కోశాలయమునకును, అన్యస్థానములకును క్రుద్ధుఁడై నిప్పును బెట్టినాఁడు బహుమూల్యములు కల సామగ్రులన్నియును భస్మమగుచున్నవి" ఇది వినఁగానే మహారాజు విచలితుఁడయ్యెను. ధైర్యముతో నీమాటను వినఁగానే ఆయతిథి ద్విజుని సమీపమునకుఁబోయి. అత్యంత నమ్రతతో నిట్లనెను:- "స్వామీ! నాయపరాధమును క్షమింపవలయును వచ్చుటలో నాలస్యమైనది. మీయాజ్ఞానుసారముగ నేను నాపుత్రుని మాంసమును వండి తెచ్చితిని. మీరు దీనిని ప్రేమతోఁ దినుఁడు"

బ్రాహ్మణుఁడు గుడ్డను దొలఁగించి పళ్లెరములోనున్న మాంసమును గాంచి, కుపితుఁడై యిట్లనెను:- 'నీవే యీ మాంసమును దినవలయునని నేనాజ్ఞాపించుచున్నాను"

బ్రాహ్మణుని యీమాటలను విని రాజేమియును వెనుకాడక బ్రాహ్మణుని యాజ్ఞచేఁ దనపుత్రుని మాంసమును దినుటకుద్యుక్తుఁడయ్యెను. అతఁడు పిల్లవాని ప్రజ్ఞనుదీసి మాంసమును దినుటకుద్యుక్తుఁడు కాఁగానే బ్రాహ్మణుఁడు నవ్వి చేయి పట్టుకొని యిట్లనెను:— "రాజా! యథార్థముగ నీవు క్రోధమును జయించితివి వాస్తవముగ నిష్పృహమైనది నీవు భగవంతుని మాయనుండి తరించితివి. నేను సాక్షాత్తుగఁ జతురాననుఁడగు బ్రహ్మను. నీస్థైర్యమును బరీక్షించుటకై నా నెలవును విడి నీకడకు వచ్చితిని. నీవతిథుల సేవకై సమస్తమును జేయఁగల వని తెలిసికొంటిని. బ్రాహ్మణులకు సంభవాసంభవములగు వస్తువుల నీయఁగలవు." ఇట్లుపలికి బ్రహ్మ తన నిజస్వరూపమును జూపి యంతర్ధానుఁడయ్యెను. ఆతనిచే ఖండింపఁబడిన పుత్రుఁడే వస్త్రాభూషణములచే నలంకృతుఁడై యెదురుగా వచ్చుచుండుటనుగాంచెను. తానేపుత్రునిఁ జంపినాఁడో ఆ తఁడే మరల వచ్చుటనుగాంచి రాజిది భగవత్కృపయని తలఁచెను.

బ్రాహ్మణుఁడంతర్హితుఁడు కాఁగానే సభలోఁ గూర్చుండిన రాజుతో సభాసదులిట్లడిగిరి:— "ప్రభూ! మీరిట్టి కఠినకార్యమేకోరికతోఁ జేసినారో అడుగఁదలఁచుచున్నాము? యశః ప్రతిష్ఠాభిలాషతో నిట్టి దుస్సాహసము నొనర్చినారా?"

ఇదివిని సంతోషముగ శిబియిట్లనెను:- 'నాయనలారా! నేనీదాన మొసంగినను, యజ్ఞాది శుభకర్మలొనర్చినను యశః కీర్తి ప్రతిష్ఠలకొఱకు కాదు నాకు దీనివలనసున నేదైన నన్యఫలము స్వర్గము ప్రాప్తింపవలయుననికాదు దానమొసం గుట సనాతనధర్మముగ నెంచఁబడినది పుణ్యాత్ములు దానము చేయుచుండెడివారు. ఈభావనముతోడనే నేను నిష్కామముగ నేను దీనినాచరించుచున్నాను. దొంగస్వభావవశమున దొంగ దొంగతనము చేయుచున్నాఁడో, మద్యపానమొనర్చువాఁడు మద్య పానమొనర్పక యెట్లుండఁజాలఁడో, అట్లే దానమొసంగుట నాకు స్వాభావికమైనది. దానిలో నాకు ప్రయోజనమేమియును లేదు. నేను దీనికి బదులుగా దేనినిఁ గోరుటయును లేదు."

సూతుఁడిట్లనెను:- "మునులారా! రాజు పలికిన యీ నిష్కపట సరళవాక్యములను విని సభాసదులందఱును బర మానందమును జెందిరి. చక్రవర్తియొక్క యీ నిష్కామ వృత్తిఁ గాంచి సురపూజితుఁడును బ్రహ్మపుత్రుఁడునగు దేవర్షి నారదుఁడును జకితుఁడై తాను రాజర్షియగు శిబి సమ్ముఖము నను చ్చుఁడనని భావించుకొనెను"

ఇదివిని శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! నారదుఁడు భగవదవతారముగదా! అతఁడు తాను శిబికంటె హీనుఁడ నని యేలననుకొనెను. అతఁడిట్టుల పలికినాడు? కృపతో మాకీ కథాప్రసంగమును జెప్పుఁడు."

అంతట సూతుఁడిట్లనెను:— "రాజా! ఒకసారి యజ్ఞము నొనర్చి విశ్వామిత్రుని అష్టకుఁడను పుత్రుఁడు విమానము నెక్కి స్వర్గమునకుఁ బోవుచుండెను. ఆతని వెంట నాతని సోదరులు ప్రతర్దనుఁడు, వసుమనుఁడు. ఉశీనరుని పుత్రుఁడగు శిబిచక్రవర్తియునుండిరి. మార్గములో వీరినందఱను నారదమహర్షి కలిసికొనెను వీరందఱును నారదుని సత్కరించి యిట్లనిరి:— "స్వామీ! మీరును మావెంట స్వర్గమునకు రండు. మాట్లాడుకొనుచుఁబోవుచుండిన దారిలో నానంద ప్రాప్తకము కాలము గడుపఁగలము"

నారదుఁడు సంచారియేకదా! ఆతనికి దీనిలో హాని యేమికలదు? అందువలన నాతఁడును వెంటఁబోయెను మాటలలో నొకఁడిట్లనెను.— "స్వామీ! మానలుగురిలో నందఱకంటె ముందుగా స్వర్గమునుండి చ్యుతులగువారెవరు?"

నారదుఁడిట్లనెను:— "నాయనా! అష్టకుఁడే అందఱకంటె ముందుగ స్వర్గమునుండిచ్యుతుఁడై యీభూమిమీఁదకు రాఁగలఁడు"

ఆతఁడిట్లనెను:- "అట్లేల స్వామీ!"

నారదుఁడిట్లనెను:— "ఒకనాఁడి నేనష్టకుని రాజధానికిఁ బోయితిని. మఱునాఁడీతఁడు నన్ను సుందర సువర్ణమం

నన్ను రథమునందు గూర్చుండఁబెట్టుకొని వాయుసేవనార్థము కొని పోయెను. అప్పుడు నేను లక్షలకొలఁది గోవులు మేయుచుండుటను గాంచితిని. ఈగోవులెవరివని నేనడిగితిని"

అష్టకుఁడు గర్వముతో నిట్లనెను:- "స్వామీ! ఈగోవులు నేను బ్రాహ్మణులకు దానమొసంగినవి. దీనివలన నాకు పుణ్యలోకప్రాప్తి కాఁగలదు." రాజు తననోటఁ దన దానమును గూర్చి ప్రశంసించుకొనెను, కావున నీతఁడు ముందుగా భూమి మీఁదకు రావలసియుండును."

అంతట ప్రశ్నించిన ముగ్గురిలో నింకొకఁడిట్లనెను:- "అయితే, మా ముగ్గురిలో మునుముందుగా భూమిమీఁదకు వచ్చున దెవరు?"

నారదుఁడిట్లనెను:- "మీలోఁ బ్రతర్దనుఁడు ముందుగా స్వర్గమునుండి చ్యుతుఁడు కాఁగలఁడు. ఈతని కథనుగూడ వినుఁడు. నేనెల్లప్పుడును దిరుగుచుండుదును. నేను జూడని రాజు లేఁడు. ఒకనాఁడు నేనీతని కడకుఁ బోయితిని. నేను దిరుగకుండఁ జాలను. ఈతఁడును నన్ను రథముమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని వాహ్యాళికిఁ గొనిపోయెను. రథమునకు నాల్గు గుఱ్ఱములు కట్టఁబడెను. క్రమముగ రాజుకడకు వచ్చి నల్గురు బ్రాహ్మణులు నాల్గు గుఱ్ఱములను యాచించిరి. రాజందఱితో నిట్లనెను:-

"మా యింటికడనుండి సువర్ణములను గొనిపొండు" వారందరును వచ్చుటవే గొనుటకు రాఁగా నొకరితర్వాత నొకరికి నాలుగు సువర్ణములను దానమొసంగెను. ఈతఁడు దానమొసంగినాఁడు కాని వారడుగఁగా సంకోచవశమున నిచ్చినాఁడు. కావున మీముగ్గురిలో నీతఁడు ముందుగా భూమిమీఁదకు రాఁగలఁడు"

అంతమిగిలిన యిద్దరిట్లడిగిరి:- "మాయిద్దరిలో మును ముందుగా స్వర్గమునుండి చ్యుతులగు వారెవరు?"

నారదుఁడిట్లనెను:- "వసుమనమహారాజే ముందుగా భూమిమీఁదకు రాఁగలఁడు. దీనికి కారణమును వినుఁడు. ఎచ్చటకు బోఁదలఁచిన నచ్చటకుఁబోఁగల పుష్పకమను రథ మొకటి యితనికడఁగలదు. ఈరాజుకడనుండి యీరథమును నే కొనిపోవలయునని నాకు కోరిక కలిగెను. నేనీతని నడుగఁగా నాతఁడిట్లనెను - 'స్వామీ! ఈరథము మీదేకదా, మీకిష్టమువచ్చినపుడు కొనిపోవచ్చును.' మరల నేను వచ్చి అడిగితిని అప్పుడును నాతఁడిట్టి తప్పించుకొను సమాధానమునే చెప్పెను:- "చేయి దాటనీయఁగూడదు. దుష్టు నెదుర్కొనవలయును. పక్షివ్యాపారములలోఁ బ్రవేశింపరాదు. సున్నపు బట్టిలో చేయిపెట్టరాదు. నీడబ్బును నీవు కాపాడుకొనవలయును."

ఈవిధముగ నాతోఁగాదనలేదు కాని రథమునీయలేను. కావున మీరిద్దరిలో నీవసుమనుఁడే పవిత్రమనుఁడు బ్రతిగినపైకి రాఁగలఁడు,

ఇదివిని ఒకఁడిట్లనెను:— "సరియే, కానిండు. ఈశిబిచక్రవర్తియును మీరును స్వర్గమునకు వెళ్లెదరనుకొనుఁడు. మీలో ముందుగా నెవ్వరు పతనము కాఁగలరు?"

నారదుఁడిట్లనెను:— "నాయనా! శిబికంటే ముందుగా నేనే పతనమయ్యెదను. శిబిచక్రవర్తికిగల ధైర్యసాహసములును, సత్యబలములును నాలో లేవు. శిబికిగల సత్త నాకెట్లు రాఁగలదు? ఆతఁడెవరికేమి నొసఁగినను నిష్కామభావముతోఁ గర్తవ్యబుద్ధితోఁ జేయును. ఆతఁడు ఫలేచ్ఛచేఁ గార్యములొనర్పఁడు. ఆతఁడు దానశీలతయందును, సద్గుణములందును, త్యాగశీలురందును, సమస్త నరపతులలో శ్రేష్ఠుఁడు. ఈవిషయమును నేను చాలసార్లు చెప్పియుంటిని. ఒకసారి ఒక మార్గమందు కురువంశపు మహారాజగు సుహోత్రుఁడును, నీతఁడును నొకరొకరు మార్గము నడ్డగించుకొని నిలుచుండిరి. దైవయోగమున భ్రమించుచు నేనచ్చటకు వచ్చితిని "మీరొకరినొకరు మార్గము నడ్డగించుకొని నిలుచుంటిరేల" యని నేనడిగితిని.

సుహోత్రుఁ డిట్లనెను:- "మేమిద్దరమును సమానులమే; చిన్నరాజు పెద్దరాజునకు మార్గమునొసంగును. కావున నేనీతనికి మార్గము నొసంగుట లేదు. నాకీతఁడు మార్గమీయ లేదు."

అంత నేను సుహోత్రునితో నిట్లంటిని:- "రాజా! శిబి చక్రవర్తి చరిత్ర నీచరిత్రకంటె గొప్పది." ఇది విని సుహోత్రమహారాజీతనికి ప్రదక్షిణ మొనర్చి మిక్కిలి ఆదర సత్కారములతో నీతనికి మార్గము నొసంగెను. కావున నేనును నీతనికి సమానుఁడనుగాను. పుత్రుని జంపి- స్వయముగ వండి, అతిథి సత్కార మొనర్చుటయును, భవనమునకు నిప్పంటించినను మనస్సున నిసుమంతైన వికారము రానీయకుండుటయును నెంతో ధైర్యకార్యము."

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఈవిధముగ దేవర్షియగు నారదుఁడును శిబిచక్రవర్తి ధైర్యమును బ్రశంసించినాఁడు ఇప్పుడు మీకు శిబిచక్రవర్తి తర్వాత వంశవృత్తాంతమును గూర్చి వినుఁడు."



# అనువంశీయ బలి సంతతి

(౨౯౨)

శ్లో॥ శిబేశ్చత్వార ఏవాసంస్తి తిక్షోశ్చ రుశద్రథః।
తతో హేమోఽథ సుతపా బలిః సుతపసోఽభవత్।
అంగ వంగ కళింగాద్యాః సుహ్మపుండ్రాంధ్ర సంజ్ఞితాః॥
జజ్ఞిరే దీర్ఘతమసో బలేః క్షేత్రే మహీక్షితః॥

శ్రీభాగ. ౯ స్కం ౨౩ అ. ౪.౫ శ్లో॥

వ. తితిక్షునకు రుశద్రథుండు రుశద్రథునకు హేముండు హేమునకు సుతపుండు సుతపునకు బలియుఁబుట్టె నాబలివలన నంగ వంగ కళింగ సింహ పుండ్రాంధ్రులను పేళ్లుగలవా రాఱ్వురు కుమారులు పుట్టిరి.

వంశోచ్ఛేదమైనపుడు ధర్మపూర్వకముగ కామభావరహితముగ నొక ద్విజునిద్వారా వంశపరంపరను నిల్పుకొను నాచారము పూర్వముకలదు దోషము భావముచేఁగలుగును. ఒకేకార్యము అది శుద్ధభావముతోఁ జేయఁబడిన, నది అనుచితముగఁ గనఁబడినను నుచితమే యగుచున్నది. అశుద్ధభావమునఁ జేయఁబడినదగుచో నుచితమైనదైనను, నుత్తమమైనదైనను హేయమైనదే కాఁగలదు. తపము శ్రేష్ఠమైనదే; కాని దంభముచేతను, ద్వేషముచేతను, ప్రాణులకు కష్టమును గలిగించుటకుఁ జేసినదైనచో నది ఉత్తమకార్యమైనను నధమ

మైన వేశాంగలను, బలవంతముగ నితరుల ధనమునపహరించుట నింద్యకార్యము; కాని దిగ్విజయమును. యజ్ఞము కొఱకును, పరరాజులమీఁదకు దండెత్తిపోవుటయు, వారిధనమును బలవంతముగ గ్రహించుట నిందనీయ కార్యమని చెప్పఁబడదు. కావున సుఖదుఃఖములందు భావమే ప్రధాన కారణముగ నున్నది.

సూతుఁడిట్లనెను:- "మునులారా! నేను ఉశీనర సుతుఁడగు శిబిచక్రవర్తి చరిత్రమును మీకుఁ జెప్పితిని. ఉశీనరునకుఁ దితిక్షుఁడను తమ్ముఁడు కలఁడని నేనివఱకే చెప్పియుంటిని. ఇప్పుడాతని వంశమునుగూర్చియు వివరణ మొసఁగెదను. తితిక్షువునకు రుశద్రథుఁడను పుత్త్రుఁడు పుట్టెను. రుశద్రథుని సుతుఁడు హేముఁడు. హేముని సుతుఁడు సుతపుఁడు. మహాభాగుఁడగు సుతపునకే సమస్త ధర్మములు తెలిసినవారిలో సర్వశ్రేష్ఠుఁడగు బలి జన్మించెను. మహారాజు పత్నిపేరు సుదేష్ణ. సుదేష్ణ పరమరూపవతి సుకుమారి, పతిపరాయణ, సతీసాధ్వియగు రాణి. మహారాజునకు సంతానము లేకున్నను నాతఁడు రెండవ వివాహము చేసుకొనలేదు. మహారాజునకు సంతానాశపోఁగానే ఆతఁడు తన క్షేత్రమందు దీర్ఘతముఁడను మహాముని వలన అంగ, వంగ, కళింగ, పుండ్ర, సుహ్మ, ఆంధ్రులను నాలుగురు పుత్త్రులను గనెను. ఆ క్షేత్రమునందింకను పుత్త్రులు పుట్టిరి. వారు బ్రాహ్మణులైరి."

ఇదివిని శౌనకుఁడిట్లనెను:- "సూతా! ఈ దీర్ఘతమ మహాముని యెవరు? ఈతనికిని బలికిని సమావేశమెచ్చట నైనది? ఈతఁడు బలిక్షేత్రమున క్షత్రియులను బ్రాహ్మణులను నుత్పన్నము కావించెను, దయతో నీకథను వినిపింపుడు."

సూతుఁడిట్లనెను:- "స్వామీ! ఇట్టి కథలను మీకు విన్నవించుకొనుట మంచిది. ఋషులు ఏపట్టుపట్టిన నాపట్టులోనే యుందురు. తమకేది తోఁచిన దానిలోనే నిలిచియుందురు. వారేది చెప్పిన నదియే ధర్మమగును స్వామీ! మీరు తపఃప్రభావముచే సమస్తమును జేయఁగలరు. తపస్సులో గొప్పసామర్థ్యమున్నది. ఈ విషయమును నేనిదివరలోనే దుష్యంతసుతుఁడగు భరతుని ప్రసంగమునఁ జెప్పితిని. అంగిరునకు ఉతథ్యుఁడు, బృహస్పతి, సంవర్తకుఁడను ముగ్గురు పుత్రులుండిరి. ఉతథ్యమహర్షి భార్య పేరు మమత. బృహస్పతి భార్యపేరు తార. సంవర్తకుఁడు బృహస్పతి మూలమున గృహమునువీడి అవధూతయయ్యెను. ఈ సంవర్తకుఁడే మరుత్తుచె యజ్ఞమును జేయించెను. అయితే దీర్ఘతముఁడు ఉతథ్యమహర్షి యొక్క పుత్రుఁడు. బృహస్పతి శాపముచే నీతఁడు తల్లికడుపులోనే అంధుఁడై పుట్టెను, ఉత్పన్నము కాఁగానే యీతఁడు సంస్కారవశముచే వేదవేదాంగములన్నిటినిఁ జదివెను. ఈతఁడు వివాహయోగ్యుఁడు కాఁగానే ఉతథ్యమహామునికీతని వివాహము విషయమై చింతకలిగెను;

కాని పుట్టుగ్రుడ్డికి పిల్లనిచ్చువాడెవడు? ఇదియొక కఠిన సమస్య యయ్యెను. ఆసమయముననే ఒకబ్రాహ్మణునకుఁ బ్రద్వేషి యను యువతీపుత్రిక యుండెను ఆమె మిగుల రూపవతి; కాని స్వభావమున ముక్కోపి. ఆమెస్వభావమువలన బ్రాహ్మణ కుమారులలో నెవడును నామెను వివాహమాడలేదు. ఆమె యిట్లనుకొనెను:- "కానిమ్ము. దీర్ఘతముడనే నాపతిగా వరించె దను. చదివిన విద్వాంసుడగువాడు! కన్నులున్నవాడైనచో మాటిమాటికిని దప్పులు పట్టుచుండును. గ్రుడ్డివాని నెచ్చటఁ గూర్చుండబెట్టిన నచ్చటఁ గూర్చుండును; ఎచ్చట పరుండు మనిన నచ్చటఁ బరుండును" ఇట్లాలోచించుకొని ప్రద్వేషి దీర్ఘతమునిఁ దనపతిగాఁ జేసికొనెను,

దీర్ఘతముడంధుడైనను మిక్కిలి రతిప్రియుడు. సుర భీపుత్రుడగు వృషభుని వలన పిరు గోధర్మమునుగూర్చి శిక్ష ణమును బొందెను శీలసంకోచములు కన్నులలోనేయుండును కన్నులే లేనివాడు శీలసంకోచములెట్లు చేయఁగలడు, కావున నాతఁడాశ్రమమందే అందఱ సమక్షమున గోధర్మాచరణ మొనర్పసాగెను. ఆశ్రమముదగ్గఱనున్న మునులిట్లనిరి:- "ఈ దీర్ఘతముడు లోకమర్యాద నేమియును బాటించుటలేదు. కావున నీతని సమాజమునుండి బహిష్కార మొనర్పవల యును" అనుకొని మునులాతనిని వదలివైచిరి.

ఈతని భార్య కర్కశె. ఆమెకు పుత్రులుపుట్టినపిమ్మట నాలోచించి తనభర్తనిట్లనెను:– "ప్రజ్ఞాచక్షుర్స్వామీ! నేను బలుకు ఈ రెండు మాటలను వినుము ఇంక మనకిద్దరకును కుదరదు."

దీర్ఘతముఁడిట్లడిగెను:– "ఏలకుదురదు? నాలో నేమి లోపమున్నది?"

గర్జించి ప్రద్వేషి యిట్లనెను:– "నీలో నన్నియును లోపములే. పురుషుఁడు స్త్రీకి భర్తగాఁ జెప్పఁబడినాఁడు; ఏలనఁగా నాతఁడాతని భార్యను, పిల్లలను భరణపోషణ మొనరించును నీవు నన్ను భరింపవలసియుండఁగా, పైఁగా నేనునిన్ను నీ జడులు పుత్రులను భరింపవలసి వచ్చుచున్నది. పాలించుటచేతనే పురుషునకుఁ బతియను సంజ్ఞ కలిగినది. నీవు నన్నుఁ బాలించుటయును లేదు. భరించుటయును లేదు. కావున నీకిష్టమున్న చోటకు వెడలిపొమ్ము నాకిష్టమువచ్చిన చోటుకు నేను బోయెదను."

దీర్ఘతముఁడిట్లనెను:– 'అయితే, నీవొక పనినిఁ జేయుము నన్నునీవు ధనికుఁడగు క్షత్రియునికడకు గొనిపొమ్ము అతనికడ నేను కొల్లగధనమును యాచించి తెచ్చినీకిచ్చెదను''

వ్యంగ్యస్వరమునఁ జేతులను త్రిప్పుచు, సైగలు చేయుచుఁ బ్రద్వేషి యిట్లనెను:– "నాకు నీధనము గినములతోఁ

బని లేదు. అటువలెనుఁ గుఁబంటను గొనిపోయినట్లు నీకష్టకు బట్టుకొని నేను రాజభవనము భిక్షమెత్తుకొనఁబోఁజాలను. ఇఁక నీకును నాకును కుదురదు. నీకిష్టమున్నచోటకు నీవుపొమ్ము, నాకిష్టమున్నచోటునకుఁ నేను బోయెదను."

దీర్ఘతముఁడును నేమియును దీసిపోయినవాఁడుకాఁడు. అతఁడును దపస్వియగు మునిరేఁ. అతనికిని గోపమువచ్చెను. అతఁడిట్లనెను:- "నీవు నన్నిట్లు విడచిపోఁగలవు?"

ప్రద్వేషి యిట్లనెను:- "నీవు నన్నుఁ గొంటివా? నాకిష్టమున్నచోటునకుఁ బోయెదను."

దీర్ఘతమ మహాముని యిట్లనెను:- "నీకు నీరూపము మీఁద మిక్కిలి అభిమానము కలదు. ఇంకొకనికడ నుండి వచ్చునని నీవు తలంచితివి కాఁబోలు. చూడుము. నేఁటినుండి నేనొక నియమము నేర్పఱచెదను. ద్విజపత్ని యేస్త్రీలోను మఱియొక భర్తను గట్టుకొనకుండును గాక! ఆమె పతిత్యజించినను చచ్చినను నాతనికి సంబంధించినదై యుండవలయును. అట్లుగాక అన్యథా ఆచరణ మొనర్చునో నామెకు జనము నిందకలుగుఁగాక!"

ప్రద్వేషి కోపము మిక్కిలించెను. ఆమె తన యువక పుత్రులతో నిట్లనెను:- "పిచ్చిలారా! నమ్మకుఁడు నీ మీ తండ్రినిఁబట్టుకొని గంగలో వదలిరండు."

ముని పుత్రులును నాయంధుని స్వభావమునకు ఖిన్ను లై యుండిరి. అందువలనఁ దల్లి చెప్పఁగానే వారాతనినిఁ బట్టుకొని పోయిరి. ఎంతైనను దండింపరా! అందువలన గంగలో నాతనిని ముంచలేరు కాని ఒక చిన్న నౌకయందాతని బంధించి శ్రావణ భాద్రపదములలోని నిండుగంగా ప్రవాహమందు ఆతని నిరాధారముగ వదలి యిట్లనిరి:- 'తండ్రీ! త్వరగాను మీరాయదృష్టమున్న చోటునకుఁబొండు"

మునియంధుఁడు. జ్ఞాని ఏమియును మాటలాడక మెదలక నౌకలోఁ గూర్చుండెను. నౌకకొట్టుకొని పోవుచుఁగా కొంతకుఁ జాలదూరముగ బలియా సమీపమునకుఁ జేరుకొనెను. ప్రాతఃకాలమయ్యెను. ముని యేమియును మాటలాడలేదు ఆదేశమయమునకు సుతపుని సుతుఁడు బలి అచ్చటకు గంగాస్నానమునకై వచ్చెను మునినౌక రాజు సమీపమునుండియే పోవుచుండెను. నౌకపై వల్లెకారి లేకుండుటను గాంచెను. ఎవరో మనుష్యుఁడు దానిమీఁద బాధింపఁబడి యుండెను వెంటనే ఆతఁడు నౌకను బట్టుకొని, బంధింపఁబడిన మునిని విడిపించి యిట్లడిగెను:- "స్వామీ! మీరెవరు? ఈ నౌకయందు మిమ్మెవరు బాధించినారు?"

ముని యిట్లనెను:- "రాజా! నేను మహర్షియగు అంగిరుని పౌత్రుఁడను. ఉతథ్యమహాముని పుత్రుఁడను. నన్ను

దీర్ఘతముఁడందురు. అజ్ఞానులగు నాపుత్రులు తమ తల్లి చెప్పఁగా నేనంధుఁడనని తిరస్కరించి, నన్నీ శోకకు బాధించునీటిలో వదలి వైచిరి."

దీర్ఘతముని పరిచయమునుబొంది రాజు మిక్కిలి ఆనందించి వినయభావముతో నిట్లనెను:- "స్వామీ! మీరు గడచినదానిని మఱువవలెను. నేను మీకు సేవకుఁడను. మీకీరాజ్యమును మీయదిగనే భావించి, యిచ్చట సుఖముగ నివసింపుఁడు."

ముని దీనినే కోరుకొనుచుండెను. రాజు ప్రార్థన నాతఁడంగీకరించి, అచ్చట బలిమహారాజుకడ సుఖముగ నుండెను. ముని రతికర్మయందు మిక్కిలి దక్షుఁడను సంగతి రాజునకుఁ దెలియఁగానే ఆతఁడిట్లు ప్రార్థించెను:- "మునివరా! నా కొఱకు మీరు సంతానోత్పన్నము కావింపవలయును."

ఇందు మునికి చిక్కేమున్నది? ఆతఁడిట్లనెను:- "మంచిది, రాజా! నేనీవిద్యలో దక్షుఁడను. సురభి పుత్రునివలన నేను గోధర్మశిక్షణమును బొందితిని."

రాజిట్లనెను:- "స్వామీ! దయచేసి గోధర్మమునిచ్చట నాచరింపకుఁడు. మనుష్యధర్మమే బాగుండును. నారాణియందు మీరు గర్భాదాన మొనరింపుఁడు." ఈవిధముగ

ముని ఛందోకారము రాంగానే రాజు తన పతివ్రతయగు భార్యతో నిట్లనెను:– "వంశవృద్ధికొఱకు నీవు దీర్ఘతమ మహామునికి సేవ చేయుము."

రాణి 'సరియె' నని యొప్పుకొనెనుగాని ఆమెకు నచ్చింపలేదు. ఆమె పోవుచుండగా ముని వృద్ధుండగుట యొకటియు, రెండవది అంధుడు. అతని శరీరము నల్లగాం గురూపముగ నుండెను. అందువలన నామె దాసీలలో నొకతెను మునికడకుం బంపెను. మునివరుండగు దీర్ఘతముండామెవలన కక్షీవంతాది పదునొకండు పుత్రులనుత్పన్నము కావించెను. ఆ పుత్రులను చూచి రాజు మునితో నిట్లనెను:– "స్వామీ! మీరు నా యీపుత్రులను నాకొసంగుడు."

ముని యిట్లనెను:– "రాజా! వీరు నీపుత్రులుకారు, నా పుత్రులు. నేను నాకొఱకు వీరినుత్పన్నము కావించితిని. మీ రాణి నేనంధుడనని నాకడకు రానేలేదు."

ఇదివిని రాజు పట్టపురాణియగు సుదేష్ణకు నచ్చంజెప్పి అంగీకరింపంజేసెను. అంత ముని రాణిగర్భమునుండి పరమ యశస్వులగు అంగ, వంగ, కళింగ, పుండ్ర సుహ్మ. ఆంధ్రులను రాజులను పరమ యశస్వులగు బిడ్డల నుత్పన్నము కావించెను. గర్భాధాన సమయమున నొకానొక సంఘటనము వలన ముని యీపుత్రులను క్షత్రియత్వమునుండి భ్రష్టులను గావించెను.

శౌనకుఁడిట్లనెను:- "సూతా! ఏసంఘటన జరిగెను?"

సూతుఁడిట్లనెను:- స్వామీ! వినుఁడు. మీవంటి సాధు మహాత్ములకు ఈవిషయములు మీకింతకుముందే తెలుసు, ఈ మునులమాయ విచిత్రమైనది. క్షణములో రుష్టమును జెందెదరు. క్షణములోఁ దుష్టినిఁ జెందెదరు ఇది స్వభావమిది. బలిమహా రాజునకు ఐదుగురును క్షేత్రజపుత్రులైరని మాత్రము తెలిసి కొనుఁడు వీరందఱును వారివారి నామములతో దేశముల నేర్పఱచుకొనిరి. పెద్దవాఁడగు అంగుఁడు అంగ (బీహారు) దేశము నకు రాజయ్యెను. రెండవవాఁడగు వంగుఁడు వంగదేశమున కును, మూఁడవవాఁడగు కళింగుఁడు కళింగదేశమునకును రాజు లైరి. పుండ్రసుహ్మాదులును వారివారి పేర్లతో దేశములను ప్రసిద్ధి కావించిరి, అవియిప్పటికిఁ దూర్పుదిశయందు వాని నామములతోడనే విఖ్యాతినిఁ జెందియున్నవి. ఈరాజులంద ఱును విశుద్ధ క్షత్రియులు కాక ఒక విశిష్టజాతివారైరి; ఇప్పుడు నేనీవంశములన్నిటిని వర్ణింపఁబూనుచో కథలు చాల పెరుగఁ గలవు. కావున బలియొక్క కొడుకులలోఁ బెద్దవాఁడగు అంగుని వంశావళినిఁ జెప్పి అనువంశకథను సమాప్తి కావించె దను. అనంతరము యయాతియొక్క తృతీయపుత్రుఁడగు ద్రు హ్యుని వంశమునుగూర్చి చెప్పెదను."

శౌనకుఁడిట్లనను:– "సూతా! ఇఁక తొందరపడవలయును. మేము శ్రీకృష్ణ చరిత్రమును వినవలయునని ఆతురపడుచున్నాము. అంగునకుఁ బుత్రు లెవరు?"

సూతుఁడిట్లనను:– "స్వామీ! వినుఁడు. బలిపుత్రుఁడు ఖనపానుఁడు. ఆతనికి దివిరథుఁడు, ఆతనికి ధర్మరథుఁడు, ధర్మరథుని పుత్రుఁడు చిత్రరథుఁడు, ఈతనికింకొక పేరు రోమపాదుఁడు. ఆతనికి సంతానమేమియును లేదు అందువలన నయోధ్యాధిపతియగు దశరథ మహారాజు తన కుమార్తెయగు శాంతయను నామెను రాజున కొసంగెను. రాజామెను ఋష్యశృంగుని కొసంగి పెండ్లియొనర్చెను చాల మోసమొనర్చి రాజా మునిపుత్రునిఁ బిలిపించెను. ఆతనికి చతురంగుఁడను పుత్రుఁడుదయించెను. ఆతనికి........"

ఇదివిని శౌనకుఁడిట్లనను:– "ఆఁ ఆఁ, సూతా! ఇప్పుడంత తొందరకూడ పనికిరాదు రోమపాదమహారాజు మునిపుత్రుఁడగు ఋష్యశృంగునెట్లు మోసగించి పిలిపించినాఁడు? దశరథ మహారాజు తన పుత్రికనేలయొసంగినాఁడు? ఈప్రసంగమును స్పష్టముగఁ జెప్పవలయును."

సూతుఁడిట్లనను:– "స్వామీ! నాకన్ని విధములను మరణమే. విస్తార మొనర్చిన మీరు సంక్షేప మొనర్పుమనుచుందురు. సంక్షేప మొనర్చిన గడ్డిని దరిగినట్లు తరుగుచున్నా

# రోమపాద మహారాజు

(౬౯౭)

శ్లో॥ సుతో ధర్మరథో యస్య జజ్ఞే చిత్రరథోఽప్రజాః।
రోమపాద ఇతి ఖ్యాతస్తస్మై దశరథః సఖా॥

శ్రీభాగ. ౯ స్కం. ౨౩ అ. ౬ శ్లో॥

"వ...... సుధీరునకు సత్యరథుండు సత్యరథునికి దివిరథుండు దివిరథునికి ధర్మరథుండు ధర్మరథునకుఁ జిత్రరథుం డుఁబుట్టిరా చిత్రరథుండు రోమపాదుండు నాఁబఁగె"

శ్రీమదాంధ్ర భాగవతము.

అతిథోపకరణములచే ధనైశ్వర్యములు పెరుగవు ఎవరి కెట్టి భావనయుండునో అట్టి ఫలమే లభించును. ఒకపూర్వగాథ కలదు ఒకానొకరాజు వేటకై వనమునకుఁబోయెను. అచ్చట అతనికి బాగుగా దప్పిక కలిగెను. సేవకులిట్లనిరి:- "మహారాజా! ఇచ్చటకు సమీపముననే మనరాజ్యమునకు సంబంధించిన దానిమ్మ వనముకలదు. దానిలోనికి దయచేయుఁడు". ఇది వినఁగానే రాజచ్చటికిఁబోయెను. మంత్రియును వెంటనుండెను చూడఁగా వనము చాలపెద్దదిగనుండెను. వేయిమంది తోటమాలులు దానిలోఁ బనిచేయుచుండిరి. రాజునకత్యధికమున దప్పికవైచెను. అతఁడతిశీఘ్రముగ జలమును దెమ్మనెను.

వెంటనే ఒక తోటమాలి సమీపముననున్న చెట్టునుండి ఒక దానిమ్మపండును కోసి, దానిరసమును పిండెను. ఒక పాత్ర నిండెను. రాజు త్రాగెను. రసము మిక్కిలి మధురముగ నుండెను. రాజునకు మిక్కిలి ఆనందము కలిగెను. 'ఇచ్చట ఫలములెచ్చటికిం బోవు'నని రాజడుగుటకుం బ్రారంభించెను. తోటమాలి యిట్లనెను:— "మహారాజా! ఇచ్చటనుండి రాజ్యమందలి దేవాలయములకు బోవును; నైవేద్యమైన తరువాత బ్రాహ్మణులకును, మిగిలినవారి కడకును బ్రసాదరూపమునఁ బంపఁబడును"

రాజిట్లడిగెను:— "ఇచ్చట పనిచేయు తోటమాలు రెందఱు?"

తోటమాలియిట్లనెను:— "మహారాజా! నేమందరమును వేయిమందిమి."

రాజు మరలనడిగెను:— "చెట్లన్నియు నెన్ని?" వేయి చెట్లని సమాధానము వచ్చెను. ఒక్కచెట్టు పోషణమును నొక్కతోటమాలి చేయుచుండును."

రాజిట్లనెను:— "ఒక్కచెట్టునకొక తోటమాలితో పని యేమున్నది? ఒక్కఁడు బాగుగాఁబది చెట్లకు పోషణముచేయఁ గలఁడు తొమ్మిదివందల మందినిఁదీసివేయుఁడు" మంత్రి వెం

చుండెనువాడు. రాజునకు సమస్తసుఖములును గలవు. కాని: ఆతనికి బుత్రులులేరు. అందువలన నాతడు దుఃఖముతో నుండెను. యయాతి శాపముచే తన, దీర్ఘతమ మహాముని క్రోధముచేతను నీతనికి శుద్ధ క్షత్రియులతో సంబంధములేకుం డెను. అయినను నీతడు రాజే. వీనికి సూత సంజ్ఞ వచ్చినది. అయోధ్యారాజ్యపు సరిహద్దు, ఈ రాజ్యపు సరిహద్దు కలిసి యుండెను. ఆదినములలో నయోధ్యను దశరథ మహారాజు పాలించుచుండెను. ఈతనికి దశరథునకును మిక్కిలి మైత్రి. పరస్పరమత్యధికముగ ప్రేమించుకొనుచుండిరి దశరథ మహా రాజునకును బుత్రులులేరు ఆతడు తన మిత్రుడగు నీ సూత రాజగు రోమపాదునితో నిట్లనెను:– "నాకేసంతానము కలిగి నను దాని నేను నీకొసంగెదను."

దైవికముగ దశరథుని యుపపత్నివలన నొక కూతురు పుట్టెను. ఆకన్యక మిక్కిలిసుందరి. దేవకన్యలును నామెరూప మునుగాంచి లజ్జించుచుందురు. మహారాజు తన ప్రతిజ్ఞాను సారముగ నాకన్యకను రోమపాదు(చిత్రరథు)నకిచ్చివైచెను. మహారాజ భవనమునందాకన్యక శుక్లపక్ష సుధాకరునివలె దిన దిన ప్రవర్ధమాన మగుచుండెను. రాజకుమారి మిక్కిలి సుకు మారి, శాంత. అందువలన దల్లిదండ్రులామెను శాంతియను నామమిడిరి. క్రిమక్రమముగ శాంత యువావస్థకు బదా

ప్పైన మొదలయ్యెను. మహారాజామొదలు పూర్వప్రభువగు వరుసనైన వెనుక యుండెను.

ఆ సమయమునందే ఒక దుర్ఘటన జరిగెను. రాజు లోభ పరవశుఁడై బ్రాహ్మణులతో సంబంధమును త్రెంచెను. ఆతని ధర్మశ్రద్ధ వలన శిథిలమయ్యెను, బ్రాహ్మణులు దుఃఖితులై ఆతని కడనుండి లేచిపోయిరి. ఈ యపరాధముచే దైవము వర్షమును కురిపించకుండెను. రాజ్యమంతటను కఱవు వ్యాపించెను. వృష్టిలేకపోవుటచేఁ జెట్లును నాకులును ఎండిపోయెను. పృథివి పంటనొసంగుట నాపివైచెను. రాజునకు మిక్కిలి చింతకలిగెను. ఆతఁడు తన మంత్రులను, వేదజ్ఞులగు బ్రాహ్మణులను బిలిచి యిట్లనెను:- "దేశమందతివృష్టి, అనావృష్టులు శాసకుని పాపముచేతనే కలుగును. నా రాజ్యములోఁ జినుకైనఁ బడకుండుటకు నావలన నేమి పాపము సంభవించినది?"

అంత బ్రాహ్మణులిట్లనిరి:- "రాజా! నీవలన లోభముచే బ్రాహ్మణుల యెడల నపరాధము సంభవించినది. నీవు నిజమగు హృదయముతో నీపాపమునకుఁ బ్రాయశ్చిత్తమొనర్చుకొని, బ్రాహ్మణులను క్షమింపవేఁడినచో నింద్రుఁడు నీ రాజ్యమందు వర్షము కలిగించును. శృంగిమహాముని నీరాజ్యములోనికి వచ్చినచో నిశ్చయముగనే నీరాజ్యమందు వర్షము కురియఁగలదు"

రాజిట్లనెను:— "బ్రాహ్మణులారా! మునికుమారుఁడగు ఋష్యశృంగునిలో నాతఁడు రాఁగానే వర్షించుటకు నీతనిలో నేమి తపముకలదు?"

బ్రాహ్మణులిట్లనిరి:— "రాజా! ఈసమయమున ఋష్యశృంగుని తపస్సు సర్వోత్కృష్టమైనది. నేఁటివఱకాతఁడు స్త్రీముఖమైనఁ జూడలేదు. ఆతఁడు గంగాజలమువలె విశుద్ధుఁడు. సాంసారిక విషయముల నాతఁడెఱుఁగనే యెఱుఁగఁడు. ఆతని నట్టివాని నీరాజ్యములోనికిఁ బిలిపించి, సర్వశ్రేష్ఠ సుందరియగు నీకూఁతునిచ్చి వివాహ మొనర్చినచో నీకు గొప్ప అభ్యుదయము కలుగఁగలదు. ఆతఁడు రాఁగానే వర్షము కురియఁగలదు. ఇంతేకాదు. నీకు పుత్రుఁడుకూడ కలుగఁగలఁడు. నీకీర్తి దిగ్దిగంతముల వ్యాపింపఁగలదు."

ఇది వినఁగానే రాజునకు మిక్కిలి ఆనందము కలిగెను. ఆతఁడు తన యపరాధమునకై హృదయమునఁ బశ్చాత్తాప మునొంది బ్రాహ్మణుల పాదములపైఁబడి క్షమింపవేఁడుకొనెను. బ్రాహ్మణులు ప్రసన్నులు కాఁగానే అందఱును మరలఁ దిరిగివచ్చిరి. ఇప్పుడు రాజునకు ఋష్యశృంగుఁడు తన భవనములోనికెట్టు వచ్చునాయను జింతతప్ప వేఱులేకుండెను.

ఒకసారి ఆతఁడు గొప్పగొప్ప విద్వాంసుల సభ నొక దానిఁ గావించెను, దానిలో ఋష్యశృంగుఁడే యుపాయ

ముచేఁ దనరాజ్యములోనికిఁ గొనిరావచ్చునను ప్రస్తావము వచ్చెను. వారిలోఁ గొందఱొక విధముగను మఱికొందఱు వేఱొక విధముగను చెప్పఁదొడంగిరి. చాలమంది యిట్లనిరి:- “అతఁడిప్పటికి వచ్చుట అసంభవము. అతని తండ్రి అతని నెప్పటికిఁ బోనీయఁడు. అతఁడు నేఁటివఱకు స్త్రీనేచూడ లేదు. అతని తండ్రి మహారణ్యమున నివసించుచున్నాఁడు. అతఁడు తన పుత్రుని స్త్రీదర్శనమెన్నఁడును చేయనీయఁడు. ఒకవేళ స్త్రీఁజూచినచో నామాయలో బడిపోవునని అతని భయము”

ఈవిషయమున గొప్పగొప్ప విద్వాంసులతోఁ బనిలేదు, శాస్త్రజ్ఞులతోఁ బనిలేదు, నీతినిపుణుల వసరములేదు. గుణవంతులతోఁ బనిలేదు ఈపనిఁ గామప్రవీణులు మనోహారిణులగు కామినులే చేయఁగలరు” ఇట్లాలోచించుకొని యాతఁడు విద్వాంసులను వీడ్కొలిపి. మిక్కిలి సుందరయువతులును, రూపగర్వితలగు వారాంగనలను బిలిపించెను. వారి సమ్ముఖమున నాతఁడు తన ప్రస్తావమును బ్రస్తావించెను. అన్నిటిని విని వారు మిక్కిలి భయభీతులై చేతులు జోడించుకొని యిట్లనిరి:- “అన్నదాతా! మమ్ములను క్షమింపవలయును. మీరు మాకెంతటి కఠినాతికఠిన కార్యమునైన జెప్పుఁడు, ఎట్టిదండననైనను గావింపుఁడు కాని ఋష్యశృంగునితండ్రియగు విభాండకుని సమీపమునకు మమ్ములను బంపకుఁడు. మేమా ఉగ్రస్వ

ఘాప్రసాద మహర్షి ఖ్యాతిని వినియుంటిమి. మా కాతని తపస్సే జముఁ బ్రఁసు తెలియును, ఆతఁడు స్త్రీలనిఁ గంటగింపు కొను నవియును వినియుంటిమి. తన పుత్త్రునింతవఱకే స్త్రీనిఁ జూడ నీయలేదు. ఆతఁడే సంబంధమునఁ జాలసతర్కముగ నుండును ఆతఁడు మాపనిఁ గాంచినచో మాకు శాపమొసంగి భస్మ మొనర్పఁగలఁడు."

ఈ కార్యములో నంజఱును నసమర్థులమని తెల్పి చెప్పిన తరువాత వారిలో నొకముసలి వేశ్య తనకన్నుల నగుర వేయుచు కృత్రిమములను కల్పనెంపు ఱకలను దనచేతిలో గీసుకొనుచు నిట్లనెను:- "మహారాజా! నాకు నింతబహుమానము లభించునో నీకార్యమొనర్పఁగలను."

రాజిట్లనెను:- "నీవు మునిపుత్త్రునిచ్చటికిఁ దీసికొని వమ్ము. నేను నీకుఁ యథేష్టముగ ధనమొసంగెదను."

ఆ ముసలి ఇట్లనెను:- "మంచిది. మహారాజా! నేను ఋషి పుత్త్రునిచ్చటికి నవశ్యము తీసికొని వచ్చెదను. నాకు బహు సుందరమగు నొక నౌకఁ దానిసిఁ దెప్పింపుఁడు. రాజు గొప్పదియును, నత్యంతసుందరమైనదగు నొకనౌకను దెప్పించెను. వృద్ధ వేశ్య దానినత్యంతకౌశలముతో నలంకరించెను. దానియందు మంచిమంచి పుష్పములను, పుష్పగుచ్ఛములను నలంకరించెను. లతావితానముల నేర్పఱచెను. వివిధచిత్రములు నేర్ప

ఉండెను. ఆ వేశ్యకు వనజాక్షి ప్లకలిగి అత్యంతసుందరియగు కన్యక కలదు. ఆమె గాన, వాద్య, నృత్యములందత్యంత నిపుణ. ఆమెతో సమానమగు సుందరియగు వేశ్యలేదు. తన యీడుపిల్లతో పాటుగా నేడెనిమిదిమంది వేశ్యలను దీసికొని, ఆవశ్యక సామగ్రిని, సహచారిణులను గైకొని మునిపుత్రుని వశపరచుకొనుటకు బయలుదేరెను.’’

ఇదివిని శౌనకుండిట్లడిగెను:- “సూతా! ఈ ఋష్యశృంగమహాముని యెవని పుత్రుడు? ఆతడు తన జీవితములో నెన్నడును స్త్రీని జూడనేలేదని చెప్పితివి. అదెట్లు సంభవము కాగలదు? పురుషుడు స్త్రీ యుదరమునుండియే కదా పుట్టి యుండవలయును. అట్టియెడ నాతడు స్త్రీని జూడకెట్లుండ గలడు? ఆతడు తల్లిపాలను ద్రావి యుండవలయునుగదా!”

అంతసూతుడిట్లనెను:- “స్వామీ! ఋష్యశృంగమహాముని విభాండకుని పుత్రుడు. ఆతడు స్త్రీగర్భమునుండి పుట్ట లేదు. ఆతడు హరిణీగర్భమునుండి పుట్టినాడు. తన పుత్రుడెన్నడును స్త్రీదర్శనము కాకూడదని ఆతడు సదా జాగ్రత్తగా నుండెడివాడు. ఈతడు సాంసారిక విషయ భోగములకు దూరముగ నుండవలయునని ఆతనిఆశయము. కాని, స్వామీ! అదెట్లు సంభవము కాగలదు? స్త్రీ పురుషులందు బరస్పరము స్వాభావిక ఆకర్షణము కలదు. ఇది మనుష్యకృత

మగు నాకర్షణము కాదు, దైవకృతము, బ్రహ్మ మొదట పురుషులనే సృష్టించెను. అప్పుడు మానసిక సృష్టియే జరుగుచుండెడిది బ్రహ్మ చాలమంది పుత్రులను బుట్టించెను. ఆతఁడందరికిట్లాజ్ఞాపించెను:- "మీరందఱును సృష్టిని వృద్ధిచేయుఁడు" కాని; కారణము లేక యెవరీజంజాటములోఁ బడగలరు? సృష్టి వృద్ధియం దెవరికిని రుచికలుగలేదు. ఎవరికిని నచ్చలేదు అందఱును గూర్చుండి రామరామ యని జపించుకొనుచుండిరి. బ్రహ్మ అందఱను బుజ్జగించుచు నుపదేశించెను, పితృభక్తిని గూర్చి చెప్పెను కాని అంతయును వ్యర్థమయ్యెను. అంతనాతఁడు చింతలోఁబడిపోయెను. అప్పుడు భగవంతుని శరణు వేఁడెను భగవానుఁడు తనమాయచే నొకబ్రహ్మను రెండు బ్రహ్మలుగ నొనర్చెను. అందులో నొకభాగమునుండి స్త్రీ యయ్యెను. ఆమెను జూడఁగనే అందఱకును వివాహమాడు నిచ్ఛ జనించెను. ఇఁకఁ జెప్పకయే సృష్టివృద్ధి కాఁజొచ్చెను. భగవత్కృపా పాత్రులెవరో ఒకరు దీనినుండి తప్పించుకొనఁగలరు. కావున ప్రాణిమాత్రునకీయాకర్షణము కలుగును. అప్పుడు బ్రహ్మయైనను నాతని వాపఁజాలఁడు. ఒక్క నారాయణ ఋషి తప్ప యీయాకర్షణమును దప్పించుకొనిన వారెవరు? నరుని చిత్తమును జంచలమయ్యెను. హరిగురు కటాక్షము కలిగి, బయటపడవలయునను నిచ్ఛగలవాఁడే దీనినుండి బయటపడఁగలఁడు. కావున మునులారా! ఏదికలదో అదియేయగును.

ఇప్పుడు మీతో నేమిచెప్పఁగలను? ఏకాంతమున యువకుని గాంచి యువతియు, యువతిని గాంచి యువకుఁడును దమ్ముఁదాము మఱచిపోవుచుందురు. ప్రతిజ్ఞలన్నియును శిథిలములై పోవును''

ఇదివిని శౌనకుఁడిట్లనెను:- ''అయితే సూతా! ఇంకఁ దరువాత కథను చెప్పుము. ఋష్యశృంగ మహాముని జన్మము హరిణీ ఉదరమునుండి యెట్లైనది? హరిణినుండి పురుషబాలకుఁడుత్పన్నమగుట యసంభవము. అతఁడు విభాండకముని పుత్రుఁడని యెట్లుపిలువఁ బడినాడు? ఆవృద్ధవేశ్య వశమునకుఁ బోయి యేమిచేసినది? ఈవిషయములన్నిటిని వినుటకు నాకు కుతూహలముగా నున్నది.''

అంతసూతుఁడిట్లనెను:- ''స్వామీ! ప్రపంచములో నసంభవమనునదేదియును లేదు. తీవ్రములే భగవన్మాయా శక్తిఁ దెలిసికొనక వారిబుద్ధికి వచ్చినట్లసంభవ మనుచుందురు. భగవన్మాయలో సమస్తమును సంభవమే. గోకర్ణుఁడు గోగర్భమునుండి పుట్టెగాఁడు. వ్యాసునితల్లి, సత్యవతి చేఁపకడుపు నుండి పుట్టినది. కృపుఁడు, కృపియునుండి యుద్భవించిరి. అగస్త్యుఁడును వశిష్ఠుఁడును ఘటమునుండి యుత్పన్నమైరి. ద్రోణాచార్యుఁడు యజ్ఞమునొక్క ఒక్క ద్రోణమనుపాత్రి మునుండి యుద్భవించినాఁడు. ఒక్కటికాదు ఇట్టి యుదాహ

రణములనసంఖ్యాకములుగఁగలవు. ఇప్పుడును నచ్చటచ్చట నిట్టివి కనఁబడుచున్నవి. అమోఘవీర్యులగు ఋషులవీర్యమెన్న టికిని వ్యర్థము కాదు. అదియెచ్చటఁబడిన నచ్చట సార్థకము కాఁగలదు. సరియే, నేను మీకు ఋష్యశృంగ మహాముని యుత్పత్తి కథను జెప్పి, తరువాత నావేశ్యామాయను గూర్చి చెప్పెదను. మీరీ సరస, శిక్షాప్రదమగు నుపాఖ్యానమును సావధానముగ వినుటకుఁగృప యుంచుఁడు.



# ఋష్యశృంగముని – వేశ్యాపుత్రి

(౬౯౯)

శ్లో॥ శాంతాం స్వకన్యాం ప్రాయచ్ఛదృష్యశృంగాయ ఉవాహ తామ్।
దేవేఽవర్షతి యం రామా ఆనిన్యుర్హరిణీసుతమ్॥

శ్రీభాగ. ౯ స్క. ౨౩ అ. ౭ శ్లో॥

క॥ సంతతిలేని కతంబునఁ
జింతించుచు నుండ నతని చెలికాఁడగు ధీ
మంతుఁడు దశరథుఁడతనికి
సంతతిగానిచ్చె నాత్మజను శాంతాఖ్యన్.

శ్రీమదాంధ్ర భాగవతము.

అజ్ఞానమందు త్యాగముండదు. నేను సాంసారిక విషయములనుండి కన్నులను మూసికొందును. అవి నన్ను బలవంతముగ నవియేమిచేయఁగలవని యనుచుండువారు కలరు. నీవు బయటి విషయములను జూడవుకాని సాంసారిక భోగవాసనలతోఁ గూడిన లోపలివిషయముల నెట్లు త్రోసివేయఁగలవు? మనస్సు నిర్విషయము కానంతవఱకు, భోగవాసనక్షయము కానంతవఱకు కన్నులనెంతగా మూసుకొన్నను ప్రయోజనము లేదు. ఉండునదా భూతములచే నేర్పడిన ప్రపంచమునుండు

“బయటనుండిన మనస్సు చంచలమగుచుండును, చిత్తమెటు నిలుఁ దెసకు పోవుచుండును. నేను జలములో మునిఁగి సమాధిస్థుఁడ నయ్యెదను అచ్చట శబ్దములేవియును వినఁబడవు. ఆకర్షణ రూపములు చూచుటకుఁ గనబడవు.” అని సౌభరి మహాముని యనుకొనెను. యిట్లాలోచించు సౌభరి యమునానదీజలములందు సమాధిస్థుఁడయ్యెను. సమాధికైనను నెప్పుడో యొకప్పుడవసానముండును. ఒకదినమున సమాధి తెలియఁగానే దృష్టి వెంటనే ఒక మకరముపైఁ బడెను. అది తన భార్యాబిడ్డలతో విహారమొనర్చుటను గాంచఁగానే గృహస్థుభావనయను వాసన ముని మనమున జాగృతినొందెను. అతఁడు వెంటనే జలములనుండివచ్చి, యేఁబదిమందిని వివాహమాడి. అయిదు వేలమంది పుత్రులను గనెను. ఇంతకు సారాంశమేమనఁగా లోపలవాసనలున్నచో నొకప్పుడు కాకున్న నింకొకప్పుడైనను బయటపడితీరును సంసారములో నుండిన నెప్పుడో ఒకప్పుడు విషయసంసర్గముండితీరును. పైకి కన్నులు మూసుకొనుటచేత ధనుర్బాణములను ధరించిన వేటగానినిఁగాంచి నిప్పుకోడి (ఉష్ట్ర పక్షి) ఇసుకలోఁదలను దాచుకొన్నట్లుండును. “నేను వానినిఁ జూచుటలేదుకదా యని అది యనుకొనుచుండును. కాని తాను జూడకున్నను దన్ను వారు జూచుచున్నారను సంగతి దానికిఁ తెలియదు చాలమంది అభిమానము గలవారు నేను వీనినిఁ గనిపెట్టుకొని యుందును, దీనిని విచలితము కానీయను” అను

చుందురు. ఇతరులసంగతి వట్లుంచి ముందు తనసంగతిఁ జూచు కొనవలయును. తాను తన మనస్సును వశమొనర్చుకొనలేని వాఁడు అవసరము వచ్చినప్పుడు బాహ్యప్రాణితరులకు ఉత్తరాయిత్వమెట్లు వహింపఁగలఁడు? నివృత్తిమార్గము సర్వశ్రేష్ఠమైనదనుట నిర్వివాదవిషయము. ముందుగా గుడ్డను బురదలో ముంచుటయును తరువాత క్షాళనములతో నదికి తెలుపు కావించుకొనుటయును బుద్ధిమంతుల యొక్క లక్షణము కాదు. ముందుగా బురదకానీయకుండుటయే శ్రేష్ఠమగు విషయము. కాని మనము బురదమార్గమున వెళ్లవలసి వచ్చినప్పుడు బురదకాక తప్పదు. అదివిదితము. అందువలన ఋషులు ప్రవృత్తి మార్గమును సంక్షిప్తముగ కోటయని చెప్పిరి. ముందుగా గృహస్థాశ్రమమునుండి విషయానుభవమొనర్చియు తరువాత మెల్ల మెల్లఁగా దానినుండి యుపరమింపవలయును. ముందుగా దాని అనిత్యతను, క్షణభంగురతను గూర్చి అనుభవింపవలెను. తరువాత వస్తువితతినుండి విరక్తుఁడు కావలయును. దీనిఁ గ్రమమార్గమందురు. ఇదియే రాజపథము. ఇదియే విఘ్నబాధారహితమగు మార్గము. విషయానుభవ మొనర్పక, క్షణికావేశమున నవయువకులనైన నుత్తేజితులై వైరాగ్యధారణ మొనర్చిన వారిలోఁ జాలమంది పతనమగుటను గాంచుచున్నాము. కావున విశుద్ధనివృత్తిమార్గమున కేకొలఁదిమందియో అధికారులగుచున్నారు. గొప్పగొప్ప ఋషులును మహాత్ములును ప్రవృత్తి

మార్గము స్వీకరించిరి. అందువలన వారు ధర్మముగ వేదవిధి ననుసరించి దార్పగహణ మొనర్చిరి. ఈవిషయమున మిథ్యా హాకమును గావించినవారు సాధారణముగ జారిపోవుచుండు టను గాంచుచున్నాము.

సూతుఁడిట్లనెను:- "మునులారా! నేను ముందుగా మీకు ఋష్యశృంగమహాముని ఉత్పత్తికథను జెప్పి, ఆ వేశ్య యొక్క మోహన కార్యకథను జెప్పెదను.

కశ్యపప్రజాపతికి విభాండకుఁడను నొక పుత్రుఁడుం డెను. ఆతఁడు గొప్ప త్యాగి, తపస్వి, సంయమి. స్వాధ్యాయ పరాయణుఁడు. విశ్వామిత్రుఁడు తపస్సుజేసిన సిద్ధాశ్రమ మందే ఆతఁడు నివసించుచుండెను. ఆతని తపస్సునకు సర్వ త్రా ఖ్యాతికలదు. ఆతఁడొక విశాల సరోవరమున నిలుచుండి సూర్యుఁడు తనవీపుపై పునకు వచ్చువఱకు తపస్సు చేయుచుం డెడివాఁడు. సరోవరము మంచిచక్కనిది, సువిస్తృతమైనది. దానియందు నానావిధములగు కమలములు వికసించియుండును దేవతలు, సిద్ధులు, చారణులు దానిలో స్నానముచేయవచ్చు చుందురు.

ఒకసారి ముని యెండకాలములో నదేసరోవరమందు నిలుచుండి తపమొనర్చుచుండెను సూర్యుఁడి నెత్తి మీఁదకు వచ్చుచుండెను. నిలుచుండి నిలుచుఁడి ముని యలసిపోయెను,

శరీరమంతయు వ్యాపించెను. సూర్యుఁడు పూర్ణకళలతోఁ ప్రకాశించుచుండెను. సరిగా నాసమయముననే స్వర్గమున నప్సరః శ్రేష్ఠ సుందరియగు నూర్వశి స్నానార్థమై అచ్చటకు వచ్చి యుండెను. ఆయనుపమ రూపలావణ్యయుక్తయగు స్త్రీయల లనను గాంచఁగానే మునిమనస్సు విచలితమయ్యెను. అతఁడెంతో ప్రయత్నమొనర్చి, దృష్టినావైపునుండి మరలింపఁ జూచెను గాని ఆమెయందున్న సౌందర్యాధిక్యతనుబట్టి అతఁడు తన ప్రయత్నమునందు విఫలుఁడయ్యెను. అతఁడు తదేకదృష్టితో నా రూపరాశిని, సౌందర్యమునకు సాకారప్రతిమను, మాధుర్య మనోహరమూర్తి నట్లే చూచుచు నిలుచుండెను. అతనికిఁ దెలియకయే అతని వీర్యము స్ఖలితమయ్యెను. ఆసమయమున నా యాశ్రమములోని పెంపుడుజింక అచ్చటికి నీరు ద్రావెను. నీటితోఁబాటుగా నాయమోఘ వీర్యమునుకూడ త్రావెను. దానికి గర్భము నిలిచెను. దాని కడుపునుండియే మహాముని యగు ఋష్యశృంగుఁడుదయించెను మృగీగర్భమునుండి యుదయించుటచే నాతని శిరస్సుమీఁద నొకకొమ్ము పుట్టెను. విభాండక మహర్షి ఆబాలకునిఁ బాలనపోషణ మొనర్చుచుండెను."

అంత శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! ఇంతటి గొప్ప మహర్షి యొక్క వీర్యము ఊర్వశీదర్శన మాత్రముచేతనే స్ఖలితమెట్లైనది? ఒకానొక హరిణి మహామునియొక్క అమోఘవీర్యమును నుదరమున ధరించు సమర్థత యెట్లుకలిగినది?"

కశ్యపసుతుండగు విభాండకమహర్షి కనంబడెను ఆమె లజ్జా భారమును బ్రదర్శించుచు సరోవర సమీపమునకుం బోయెను. ఆమె స్నానమును నెపమున వస్త్రుల తన సమస్తాంగములను నిరావృతము కావించెను. విధివిధానము, భవితవ్యతా ప్రాబల్యమున ముని దృష్టిదానిపైఁబడి, అతని శుక్రము స్ఖలితమాయ్యెను. మృగిదానినిఁ బానమొనర్చెను. దైవకృత భవితవ్యతను నెఱవేర్చుటకై శృంగిమహాముని యాహారీతి యుదకముఁ జన్మించెను. మునిపుత్రునిఁగని యాహరిణి స్తన్యము నలంకరించెను, ఆమెకిష్టవశాను ప్రారబ్ధసిద్ధి ప్రాప్తమయ్యెను. విభాండకముని యాబాలకునకు గోక్షీరములనొసంగి పాలన పోషణ మొనర్చుచుండెను.

మునికి శుక్రపతనముచే తపోభంగకలిగెను. ఆతఁడిట్లను కొనెను:– 'అప్సరసను జూచుటతోడనే నాతేజము పతించినది. ఇప్పుడు నేనీపుత్రునకు పొరపాటునకైన స్త్రీ దర్శనము కానీయను. వీనిని విశుద్ధ బ్రహ్మచారిగా నొనర్చెదను.' ఇట్లాలోచించుకొని ఆతఁడు తన పుత్రుఁడగు ఋష్యశృంగునిఁ దన ఆశ్రమమును దాటి పోనిచ్చుటలేదు. ఆతఁడాతని నియమపూర్వకముగ జపాగ్ని హోత్రాదులను జేయించుచుండెను. వేదమును జదివించుచుండెను. పెద్దపెద్ద ఋషులతోఁగాక మరొకరితోఁ గలియనిచ్చుటలేదు. స్త్రీని దన యాశ్రమము సమీపమునకుఁగూడ రానిచ్చుటలేదు. వృద్ధఋషిపత్నియైనను వచ్చు

టకు వచ్చుటలేదు వచ్చుట యెఱుంగఁడు. పుత్రిసమ్ముఖ ముఁన నెన్నఁడును స్త్రీయొక్క పేరైన వినుటలేదు. మునులు తప్ప యింకెవరైన స్త్రీపురుషులుందురని యైనను నాతఁడెఱుఁ గఁడు. ఆతఁడెన్నఁడును నగరమునుగాని, నగరములోని వస్తువు లనుగాని చూచియుండలేదు. ఆతఁడు బ్రహ్మచారులవలె మౌంజీమేఖలను ధరించును: రుద్రాక్షమాల, కుశపవిత్రము, బ్రహ్మదండము చేతను ధరించును పాలాశదండము, కౌపీనము నారలవస్త్రము—ఇదియే అతని వేషము. జప తపాగ్నిహోత్ర ములను, వానికవి ప్రతిదినములోని చేదు, వగరు ఫలములను, గోవులను, తన తండ్రిని తప్ప, యింకేఁ బ్రపంచములో నిం కొక వస్తువుకలదని యెఱుంగఁడు. ప్రపంచమందంతటను దేవ స్థలములనే ఆతఁడనుకొను చుండును, అందఱును జప, తప, వ్రతానుష్ఠానముల నొనర్తురను కొనుచుండెను. ఆతని తండ్రి సమిధలను, కుశలను, ఫలపుష్పములను, జలమును స్వయముగఁ దెచ్చుకొనును. మధ్యాహ్నోత్తరమున నొక్కనాఁడు ఆతఁడు బయటకుఁ బోవుచువాఁడై, ఆతఁడాశ్రమమునఁ దనపుత్రు నకుఁ జాలగఁ జెప్పెను. ఈలోగా నెవరైన ఋషులుగానిండు, మహాత్ములు కానిండు వచ్చినచో ఋష్యశృంగుఁడు వారికిని పాదార్ఘ్యములను, ఫల పుష్పములనొసంగి సంతుష్టుల నొన ర్చును వారికి స్వాగత సత్కారములొనర్చును. ఋషులందఱు ఋష్యశృంగుని యమాయకత్వమునకు సంతోషించెదు

వారు విభాండక మహాముని తనపుత్రునిఁ సరకగను, అమాయకత్వమును. విషయానభిజ్ఞతను గాంచి యుబ్బిపోవుచుండుచు. ఆతఁ డొకవిధముగ నాతనివిషయమున నిశ్చింతుఁడై యుండెను.

మునివరుఁడగు ఋష్యశృంగుఁ డిప్పుడు బాల్యావస్థను గడిచెను. యౌవనావస్థ ఆతనికిఁ దెలియకయే ఆతనిశరీరమున నధికారము జమాయించెను. ఇంతవఱకాతనికి జడలేయుండెను. ఇప్పుడాతని మూఁతివద్ద నల్లఁబడఁజొచ్చెను. అచ్చట నల్లని చిన్నచిన్న వెండ్రుకలు మొలవసాగెను, గడ్డమందును గపోలములందును వెండ్రుకలు పెరుగుచుండెను. హృదయమందును గొంచెముగ సరసతా సంచారము కాఁజొచ్చెను. యౌవన మవ్యక్తభావముచే వచ్చి ఆతని కర్ణములందేవో గుసగుసలాడెడిని; కాని దాని యభిప్రాయము నాతఁడు తెలిసికొనఁజాలక పోయెను. ఆతఁడమాయకపు పిల్లవాఁడేకదా! ఆతనిబుగ్గల మీఁద కొంచెము కొంచెముగ మొటిమలు మొలిచెను ఒక దినమున నాతఁడు తన తండ్రినిట్లడిగెను:- "నాయనగారూ! నాకివివఱకే ఒక కొమ్మున్నది. ఇప్పుడీ కపోలములమీఁదను శృంగములు పుట్టునాయేమి?"

తండ్రి యిట్లనెను:- "లేదునాయనా! ఇవి శృంగములు కావు, మొటిమలు వీనిని వ్రేళ్లతో వత్తివేయుము. అప్పుడం

మంచి నిద్రనిద్రవముపచ్చును. వయస్సు పెరిగిన నివి ముఖ
మునందు ప్రత్యక్షమగును. ఇవి మొటిమలు.

బ్రహ్మచారి యిట్లడిగెను:- "తండ్రీ! మీకువలె నాకును
నింతిదే స్తనము వచ్చునా?"

తండ్రి యిట్లనెను:- "అవును నాయనా! ఎందుకు
రాదు? కాని ఒక్కరోజులోనే రాదు, క్రిమక్రమముగవచ్చును'

పుత్రుండిట్లడిగెను:- "తండ్రీ! ఎందులకోగాని నాశరీ
రము కొంచెము విరుపుగాను, ఆవలింతలుగానున్న దేల? ఇప్పు
డు మనస్సుకు విధముగ నేమిమోగానున్నది"

తండ్రి ప్రేమతో నిట్లనెను:- "నీవుచదువులో శ్రమ
తక్కువచేయుచున్నావు. చదువుచునేయుండుము త్రికాలము
లందు స్నానమొనర్చుచుండుము, నిద్రను తగ్గించుము. ఇదొక
విధముగుకోగము."

అమాయకపు పిల్లవాడీ మాటలన్నిటిని నమ్మెను. ఆత
నికి తన తండ్రిమాటలమీద నెంతో శ్రద్ధకలదు. ఆ త ని కి
తండ్రియే సర్వస్వము. తండ్రియేమిచెప్పిన నదియే వేద
వాక్యము. ఈవిధముగ నాఋషి ఘోరతపో నిరతుడయ్యెను.
అతనికి యువావస్థను గూర్చిన సాక్షాత్పరిచయము కలుగలేదు.

ఇప్పుడు నీవృద్ధవేశ్య తననొక నలంకరించుకొని విభాండకమహాముని ఆశ్రమము వైపునకుఁబోయెను. ఆశ్రమమునకింకను రెండుక్రోసులదూరమున నున్నదనఁగా నచ్చట నామె తన నౌకనొకపర్వతము మాటున లంగరువైచి ఆపెను. ఆమె నలు వైపులను గుప్తచరులనుంచెను. వారందఱును మునియొక్క గతి విధులనుగూర్చి జాడతీయుచుండిరి. ఆమె మునియొక్క దైనందిన కృత్యమును గ్రహించెను. ముని కుశసమిధల నెప్పుడు తేఁబోవును, ఎప్పుడు తిరిగివచ్చును- ఇదంతయును దెలిసికొని ఆమె ఒకపన్నాగమును బన్నెను చతుర్దశీదినమున ముని మధ్యాహ్నకృత్యములను గావించుకొని పోవునని యు, సూర్యాస్తమానమునకుఁదిరిగి వచ్చునని యును దెలిసికొనెను. ఏలననఁగా దర్శపౌర్ణమాస్యల యజ్ఞమునాతఁడమావాస్య పౌర్ణమాస్యలందు చేయవలయును. ఆతఁడు వానికొఱకు చాలదూరమునుండి మంచి సమిధలను దెచ్చుచుండును. సరిగా నాదినముననే ఆమె ఋష్యశృంగుని మోసగింప నిశ్చయించెను.

శుక్రపక్ష చతుర్దశివచ్చెను. ఒక రహస్యస్థానమున తాను తనయువతియగు పుత్రికయు దాగియుండిరి. విభాండక మహాముని మాధ్యాహ్నిక కృత్యములను గావించుకొని, భోజనమొనర్చి కుశసమిధలు తెచ్చుటకుఁబోఁగానే ఆమె పరమ సుందరియగు తనపుత్రికను బాగుగా నలంకరించి. షోడశశృంగారములను గావించి మునిపుత్రుఁడగు ఋష్యశృంగుని కడకుఁబంపెను.

ఆ వేశ్యాపుత్రికయును ఇట్లాడే యువావస్థలోఁ బ్రవేశించెను. యౌవనమదమున మత్తయై తళుకు బెళుకులతోఁ గులుకులతోఁ మందమందగతిని నామె మునిపుత్రుని కడకుఁ జేరెను. మునిపుత్రుఁడొక కుశాసనముమీఁద వల్కలమును బఱచి దేవాధ్యానము నొనర్చుచుండెను. అప్పుడీ వేశ్యాపుత్రిక గలగలమని శబ్దమొనర్చుచు నాతని సమీపమునకుఁ జేరుకొనెను. ఈమెయొక్క బహుమూల్యములగు వస్త్రములనుండి సుగంధము వెలువడుచుండెను. ఆమె సుగంధపుష్పమాల ధరించియుండెను కేశములకు సుగంధతైలమును రాచుకొనెను. వస్త్రములందును, శరీరముమీఁదను నత్తరు నలఁదుకొనెను. ఆమెను గాంచి మునిపుత్రుఁడు వెంటనే లేచి నిలుచుండెను. ఆమె ముఖమండలము దామినివలె మెఱయుచుండెను. కర్ణకుండలములు కపోలములమీఁదకువచ్చి కదలుచుండెను. వాని ప్రకాశముచే నామె సౌందర్యము వెలిగ్రిక్కు చుండెను. ఋష్యశృంగుఁడామెను గాంచి నిర్ఘాంతపోయెను. ముని యిట్టిదానిని నేటివరకు చూచియుండలేదు. ఎంతోగొప్ప వ్రతధారియగు గొప్పజ్ఞానియని యాతఁడు తలఁచెను. అందువలన నాతఁడు తన పూజాచారము ననుసరించి మునికభ్యర్థనమును గావించి యిట్లనెను:- "మునివరా! మీ తపస్తేజముచే నేను మిమ్ములను నమస్కరించి తాపస శ్రేష్ఠులని భావించు చున్నాను. కావున నేను మీకుఁ బ్రణామ మొనరించుచున్నాను. ఈగంగాజలము

సుందరమైనది, స్వచ్ఛమైనది, నిర్మలమైనది. ఇందులో పట్టి వేస్లను బడినవి. దీనితో మీరు కాళ్లను గడిగికొనుఁడు. ఇది అష్టవస్తువులతోఁ జేయఁబడిన అర్ఘ్యము. దీనినిమీరు గ్రహింపుఁడు. ఈ సుందరవల్కలవస్త్రమును బఱచిన మృగచర్మముపైఁ గూర్చుండుఁడు ఈవనమందలి రేఁగుపండ్లు, సీమరేగు ఉసిరికపండు, ఇతర అరణ్యక ఫలములను మీరు స్వీకరించుఁడు'

ఆవేశ్యాపుత్రి యిట్లనెను:- "స్వామీ! నేనెవరి నమస్కారమును స్వీకరింపను. నేను నీపాద్యార్ఘ్యములను స్వీకరింపను. ఈరేగు, వగరుగల యీయారణ్యక ఫలము లెందులకు? వీనిని నేను దూరముగఁ బాఱవైచెదను మీరు నేనొసంగు ఫలములను దినుఁడు, నేనుదెచ్చిన పేయమును ద్రావుఁడు. నేనెవరి నమస్కారమును నిట్లుగ్రహింపను. నేనందఱను నాలింగన మొనర్చుకొనుట నావ్రతము కావున రమ్ము. నేను నిన్నాలింగన మొనర్చుకొందును"

ఈమె యాలింగనములో హాలాహలవిష మిమిడియున్నదని అమాయకుఁడగు ఋషికుమారునకుఁ దెలియదు. సరళస్వభావమున నాతఁడామె వక్షఃస్థలమును గౌఁగిలించుకొనెను. ఆవారవనిత మునిపుత్రుని గాఢాలింగనము కావించుకొనెను. మునిపుత్రుని శరీరమంతటను నొక విద్యుత్తు ప్రవహించినట్లుండెను. ఆతఁడాత్మ విస్మృతిఁజెందెను. అంతట నామె ఆతని

ముఖమును మాటిమాటికి వంగి ముద్దుపెట్టుకొనెను. ఆమె కౌగిలి సుఖస్పర్శచేతను, శరీరముయొక్క దివ్యగంధము చేతను మునికి చైతన్యముకలిగెను. ఈ మాయ యేమో అతఁడు తెలిసికొనఁజాలకపోయెను. అంతనామె మునిపుత్రునకు తనవద్దనుండి రసగుల్లాను దీసియిచ్చెను. జీవితమంతటను నాతఁడు చేదు, ఒగరు కలిగిన వన్యఫలములనే తినుచుండెను. ఆనందకర, స్వాదిష్ట, రసయుక్తము, గుటక వేయఁగానే చల్లఁగఁ గ్రిందకుపోవుచున్న సుగంధితఫలములనుదిని ఆతఁడు చకితుఁడయ్యెను. దానివలన నాతనికిఁ దృప్తి కలుగలేదు. రసగుల్లాను, గులాబుజామున్ మొదలగు వానినిఁబెట్టి, ఆ వేశ్య మంచి సుగంధితములగు ద్రవ్యములతోఁ గూడిన నాసవమును త్రాగించెను దానిఁ ద్రాగఁగానే ఆతనికిఁ గన్ను లెఱ్ఱపడెను. అప్పుడాతఁడా వేశ్యాపుత్రికను తదేకదృష్టితోఁ జూచుచుండెను అప్పుడామె తన వస్త్రమునుండి బంతినిఁదీసెను. పాద నూపురములను మ్రోగించుచు నామె బంతినెగురవైచెను ఆమె పరువిడి దానిఁ దెచ్చెడిది ఆమె ఋష్యశృంగుతో నిట్లనెను:— "నీవును దీనిఁబైనుండి పైననే నీచేతులతోఁ దీసికొనుము."

మునిపుత్రుఁడెన్నఁడును బంతినిఁజూచి యుండలేదు. ఆతఁడామె చెప్పినట్లు దానివెంటఁ బరువిడఁసాగెను. ఆమె అవకాశము చిక్కినప్పుడాతనినిఁ గౌగిలించుకొనుచుండెడిది. ముని

పుత్రునకు గొప్పసుఖముగఁ దోఁచుచుండెడిది. అతఁడుమాటి మాటికామె ఆలింగనమును గోరుకొనుచుండెను. ఈవిధముగ నామెచాలసేపటివఱకు బంతినాడుచుండెను. బంతి నాడునప్పుడు మడిమలవఱకును వ్రేలాడునామె వేణియందుకల పువ్వులు చాలరాలెను. అంతటనామె మునిపుత్రునకు గానమునువినిపిం చెను నృత్యమును జూపించెను. ముని వచ్చుసమయమైనదని గ్రహించి ఆతనితో నిట్లనెను:- "మునివరా! ఇప్పుడు నాకు వెళ్ళుటకాజ్ఞ యిండు. ఆలస్యమైనది, నేను మా యాశ్రమము నకుఁబోవలయును."

వికళితాస్వరమున ముని పుత్రుఁడిట్లనెను:- "నేను నీవులేక యెట్లుండఁగలను. నన్నుఁగూడ నీవెంటఁగొనిపొమ్ము. నీయాశ్రమ మెచ్చటనున్నది?"

వేశ్యాపుత్రి యిట్లనెను:- "మాఆశ్రమమిచ్చటికిదూర మునన్నది. ఇప్పుడు నేను సంధ్యావందనాది సాయంకాలీన కృత్యములొనర్పవలసియున్నది. నేనెప్పుడైన మరల వచ్చి నచో నీకు మాఆశ్రమమును జూపుటకుఁ గొనిపోయెదను. ఈసమయమున నాకు చాలా అవసరమైన పనియున్నది." ఇట్లు పలికి ఆమె కులుకుచు, ఓరచూపులతో నొయ్యారముగ ముని పుత్రునిఁజూచుచుఁ బోయెను"

సూతుఁడిట్లనెను.- "మునులారా! ఆవేశ్య కనఁబడు నంతవఱకు మునిపుత్రుఁడు తదేక దృష్టితో నిలుచుండిఆమెను

జూచుచుండెను. ఆమెకనుమఱుఁగు కాఁగానే ఆతఁడు క్రిందఁ బడెను ఆతనికి మూర్ఛవచ్చెను. ఆనవమదముచే నాతని కన్నులెఱ్ఱనయ్యెను, హృదయములో నొకవిధమగు భ్రాంతి కలిగెను. ఆతని వక్షమైన హృదయమును గలచినట్లుగ నుండెను. అందు మధురమగు వేదనకలుగుచుండెను. కొంత సేపటికి మునిపుత్రునకుఁ జైతన్యముకలిగెను, ఆతఁడు లేచి కూర్చుండెను. ఆతనికీప్రపంచ మంతయును శూన్యముగఁదోఁచుచుండెను. భూమితిరుగుచున్నట్లుండెను. చతుర్థశి చంద్రుఁ డాతని యాదశనుగాంచి నవ్వుచుండెను. యువకముని యొక్క హృత్తంత్రులా వేశ్యా విరహవేదనచే మ్రోగుచుండెను. ఆతఁడు సంధ్యావందనమును, వేదపాఠమును, గోదోహనము-సర్వమును మఱచి పిచ్చివానివలె నిర్నిమేష దృష్టితో నాకాశముపై పునకుఁ జూచుచుండెను. ఆతని నేత్రములనుండి అశ్రువులు స్రవించుచుండెను. ఆతఁడా వేశ్యాపుత్రియొక్క మనోమయమూర్తితో సంభాషించు చుండెను, ఆమెనుహృదయమందిరమునఁ గూర్చుండఁ బెట్టుకొని ఆమెను ధ్యానించుచుండెను.



# ఋష్యశృంగుఁడు మాయలోఁబడినాఁడు.

(౭౧౧)

శ్లో॥ నాట్యసంగీత వాదిత్రవిభ్రమాలింగనార్హణైః
సతు రాజ్ఞోఽనపత్యస్య నిరూప్యేష్టిం మరుత్వతః॥

శ్రీభాగ. ౯ స్కం. ౨౩ అ ౯ శ్లో॥

క॥ ఆడుచుఁ జెవులకు నింపుగఁ
బాడుచు నాలోక నిశిత బాణౌఘములన్
వీడుచు డగ్గఱ నొడుచుఁ
జేడియ లాతపసి కడకుఁ జేరి కలంపన్॥

శ్రీమదాంధ్ర భాగవతము.

శీల, సంకోచ, లజ్జా, వినయాది సద్గుణములు చిత్తమును కామినీక్రీగంటి చూపుల తూపులు భ్రుకుటీరూపమగు ధనస్సున సంధించి యువకుని హృదయమును వేధింపనంత వఱకే నిలుచును. మనస్సునఁ గామాసక్తి అంకురించినప్పుడు వ్యవహారమునందు గపటత బయలుదేరును. పెద్దల యెడల నాదరభావము తగ్గుచుండును. భావగోపన ప్రవృత్తి వృద్ధినిఁ బొందును. మనస్స్వన్య చింతనీయవస్తువులను వదలి యా సుందరమూర్తినే మనన మొనర్చుచుండును. భగవంతుని

కౌస్తుభహార పరిష్కృతమూర్తిని మనము నిత్యమును ధ్యానించుచుందుము. ఏకప్రాకారముగ మనస్సును దానియందు లగ్నమొనర్చుచుందుము ఎల్లప్పుడును దానిని సమ్ముఖమున నుంచుకొనుటకై ప్రయత్నమొనర్చుచుందుము. నఖమునుండి శిఖపర్యంతము. శిఖనుండి చరణము వఱకును మనోయోగముచే దానిని చింతించుచుందుము. అయినను నది మనస్సున నిలువదు. ఎన్నడును స్వప్నమునందైనను గనఁబడదు. దానికి విపరీతముగ నొకానొక సుందరియగు కామినిని సహజ స్వభావమునఁజూచినచో, చూచి దృష్టిపథమునుండి తొలఁగించినను, తత్సావలోకనముచే మనస్సు నందామూర్తి గట్టిగాఁ బాతుకొనును దానిని మఱచుటకెంతగా ప్రయత్నమొనర్చిన నంతటి స్మృతి యధికమగుచుండును. ఇదియే యీసంసారము నేర్పఱచిన వాతని ప్రకృతి, మాయలేక అవిద్యజడరూపమును మిథ్యయగు మాయయందే ఇట్టి ఆకర్షణముండినచో నామాయాపతియందెంతటి యాకర్షణ ముండవలయును: ప్రాకృతిక సౌందర్యమందే యింతటి మాదకత యుండినఁ బ్రకృతి పతిఁయగు నా పరమపురుషుని సౌందర్యమందెంతటి మోహకతయుండవలయును కాని దీనిని గ్రహించు యోగ్యత యుండవలదా? యోగ్యతయును నాతని కృపచేతనే ప్రాప్తముకాఁగలదు

సూతుఁడిట్లనెను:- "మునులారా! వేశ్య వెడలి పోయిన అల్పకాలమునకే విభాండక మహాముని సమిధల

మోఁపును శిరమునఁ బెట్టుకొని; కలె, ఫలపుష్పములను గైకొని తన యాశ్రమమునకు వచ్చెను. నేఁడాతని పుత్రుఁడు మా మూలు గతిని నాతని సమ్మానింపలేదు. పరుగిడిపోయి ఆతని శిరస్సునుండి సమిధల మోఁపును దించలేదు. కాళ్ళు కడుగు కొనుటకు గిండియందు నీరునింపుకొని తేలేదు. ఆతఁడు మునినిఁ గాంచి లేవనైన లేవలేదు. ముని ఆశ్రమమునకేతెంచు వచ్చెనని యు నాతనికిఁ దెలియదు. దీనిఁగాంచి ముని చకితుఁ డయ్యెను. నేఁడాతని పుత్రునకు వింతస్థితి కలిగెను. ఇంతకు పూర్వము ఋష్యశృంగుడిట్టి స్థితిలో నుండుటను జూడలేదు. ఋషి తుదకొంటరిగా నాశ్రమాభ్యంతరమునఁ గూర్చుండి యుండెను, ఆ వేశ్యాపుత్రికయొక్క మనోహరమూర్తిని దన్మ యుఁడై ధ్యానము చేయుచుండెను. విరహాగ, విపరీతా, విక లతా, వ్యాకులతా కారణమున నిట్టూర్పులను విడుచు చుండెను ఆతని కన్నులెఱ్ఱఁబడియుండెను ఆతఁడు తదేక దృష్టితో నాకాశము వైపునకుఁ జూచుచుండెను ఆతఁడాకా శమునఁ బ్రాటక మొనర్చుచున్నట్లుండెను. ఆతని మనస్సు దూషితమైయుండెను. తనపుత్రుని యీస్థితినిఁగాంచి ముని సమి ధల మోఁపును దించియుంచి ఋష్యశృంగుని సమీపమునకుఁ బోయి యిట్లనెను:—"వత్సా! నేఁడు నీవిట్లున్నావేల? ఇంత వఱకునీవు సాయంకాల సంధ్యాగ్ని హోత్రముల నేలఁగావింప లేదు. ఈస్రుక్స్రువములింకను గడుగఁబడకయే పడియుండిన

నేల వృక్షశాఖలలోని వస్తువులన్నియును నస్తవ్యస్తముగఁ బడి యుండిన వేల? ఈయాసనము, మృగచర్మములేపడియున్న వేల? ఈదినమున నీవు హోమములను బాలకుపిడువలేదు, ఆవులను బాలు పితుకలేదు. నీకన్నులెఱ్ఱఁబడి యున్న వేల? నీవల్కలవస్త్రము లకు హానియైనదేల? నీకిట్టి దయనీయదశ యేకారణము వలన నైనది? నీవస్వస్థుఁడవై యుంటివేల? ఇట్టిస్థితిలో నిన్నిదివరకెన్నఁడును నిన్నుఁ జూచియుండలేదు. నీవు నీదుఃఖచింత లకుఁ గారణమేమో నాకుఁ జెప్పుము."

ముని యొక్క యీప్రశ్నలను విని ఋష్యశృంగుఁడు లేచి ప్రాజ్ఞుఁడగు తన తండ్రికిఁ బ్రణామము గావించెను. ఆతఁ డత్యంతమమాయకుఁడు. మోసమును, కపటమును, దాపరిక మును నాతఁడు నేర్చుకొననేలేదు. ఇవి నగరముల యొక్కయు సభ్యతయొక్కయు యున్నతికిని సంబంధించినవి. సరళముగా, నిరా డంబరముగ వనజీవితమును గడుపు అమాయకపు మునికుమా రుఁడిక దుఃఖముండనే యుండెను. అందువలన మునియడుగఁగా సరళతతో నిట్లనెను:— "తండ్రీ! ఏమి చెప్పుదును? మీరు వెడ లిన తర్వాత నొక తేజస్వియును, తపస్వియునగు మునియిచ్చ టకు విచ్చేసినాఁడు. తండ్రీ! నేఁటివఱకింతటి ప్రభావవంతుఁ డగు తపోధనుని దర్శనమును నేను చేయలేదు, ఆతని సమస్త విషయంబులు విచిత్రములుగను, నాకర్షకములుగ నుండెను. ఆతని వేషము మన మునులందఱి వేషమునకు విలక్షణముగ

నున్నది. ఆతని జడలు పెద్దవిగనున్నవి. అవి కొంచెము పాయలుగ వెనుకవైపున సమర్చఁబడి విచిత్రరీతిని వేలాడుచుండెను. అవి మన జడలవలె రూక్షముగను, శుష్కముగను లేవు. అవి నును పుగను, సుందరముగను నున్నవి. వానినుండి నిరంతరమొక దివ్యసుగంధము వెలువడుచుండెను. వానియందు చిత్రవిచిత్ర రంగులుగల పుష్పములు గూర్చఁబడియుండెను. ఇటనో ఏమ సగాఁగొన్ని పుష్పములు పడియున్నవి. ఇవి యాతపోధనుని జడలనుండి రాలినవి ఆతని మస్తకము విశాలముగను, నాక ర్షకముగను నుండెను. మనము భస్మమును ధరించుచున్నామే, ఆముని అట్టి తిలకమును ధరింపలేదు. ఒక్క యెఱ్ఱని బొట్టును ధరించినాఁడు ఆతని శరీరమున కలఁదుకొనినభస్మము నల్లగా లేదు. స్వచ్ఛముగను, సుగంధముగను నున్నది. ఆతని కను బొమ్మలు మనకువలె లేవు, అట్టికనుబొమ్మలను నేనిదివఱకేను నిసిఁజూడలేదు. అవి సన్నముగను, వంకరగనున్నవి. వానికేమి రాచినాఁడో కాని అవి అంటుకొనియున్నవి. ఆతని నేత్రములు విశాలములుగను, కమలములవలెను నున్నవి ఆతఁడు నావైపు చూచినపుడు అమృతవృష్టిని గురిపించుచున్నట్లుండెను. ఆతని నాసిక మిక్కిలి సుందరముగను, నెత్తుగను, పలచగనుండెను. ఆతఁడెట్టి ఛిద్రమొనర్చినాఁడో కాని దానియందు గుండ్రని వస్తువును ధరించినాఁడు దానిలోని నీలపు కిరణములు మెఱయుచుండెను. తండ్రీ! కపోలములశోభను నినుమడింపఁ

చేయుచేనో గుండ్రని వస్తువులను గర్ణములందు ధరించినాఁడు. ఆతని దంతములాప్రవాళవలెఁ దెల్లగనున్నవి. ఆతని ముఖకమలమునుండి నిరంతరము సుగంధము వెలువడుచుండెను. ఆతని పెదవులు దొండపండ్లవలె నుండెను. ఆతని రుద్రాక్షలు వన రుద్రాక్షలకు భిన్నముగనున్నవి. అవి నల్లగలేవు, పచ్చగ నున్నవి. అవి తళతళమెఱయుచున్నవి. ఆతనిది తులసీమాల కాదు. ఎఱ్ఱగను, నీలముగను, పచ్చగనున్న ముక్కలుగ నున్నవి. అవేవో తెలియవు. ఆతఁడు హాలమాలలను ధరించి యుండెను ఆతని పుష్పమాలయును దివ్యమైనది. ఆతని బాహువులు లేతపల్లవములుగ సుందరముగనున్నవి. రుద్రాక్షల స్థానమున నాతఁడేవియో విచిత్రముగ మెరయుచుండు వస్తువులను ధరించియుండెను. ఆతని కంఠమునకు క్రిందను వక్షఃస్థలముపైనను గుండ్రగను, ఉబ్బెత్తుగను, రోమరహితముగను నున్న రెండు మాంసపిండములు కలవు. అవి ఒక యెఱ్ఱనిదియుఁ బలుచనిదియునగు నెఱ్ఱనివిచిత్ర వస్త్రమునఁ గట్టఁబడినవి. ఆతఁడొక నీలపు వల్కలమును గట్టుకొనినాఁడు. అది అమిత పలచనగనున్నది దానినుండి అంతయును గనుబడును. ఆతని వ్రేళ్ళు సన్నగను గోమలములుగను నున్నవి. ఆతని పవిత్రము కుశలతోఁ జేయఁబడియుండలేదు. దానిలో నేదో యెఱ్ఱగను దళతళమెఱయు వస్తువు బిగింపఁబడినది. ఆతని యుదరము కృశించినది. నాభి లోతుగను గుండ్రగను నున్నది. ఆతని

మేఖలమున మేఖలకు భిన్నముగనున్నది. దానిలోఁగల విచిత్ర మేమనఁగా నది మ్రోగును. అతని వల్కలములమీఁద నది మెఱుఁగుతీఁగవలె మెఱయును. అతని మితంబమితరమునుల నితంబములకంటెను, లావుగనున్నది. అతని వల్కలములన్నిట నుండియును సుగంధము వచ్చుచుండెను ఆతపోధనుండగు యోగి నడచుచున్నప్పుడాతని పాదములందేదో విచిత్రవస్తువు మిక్కిలి మధురస్వరమున మ్రోగుచుండును. అతని చరణములు కోమలములుగను, ఎఱ్ఱగను, రంగు వేయఁబడినట్లుగను, సుందరముగను, సుగంధయుక్తముగను నుండెను. ఆమహానుభావుఁడు విచిత్రముగ నడుచును. అతని ముఖమండలమున నిరంతరము మందహాసము వ్యాపించియుండును. అతఁడు కిలకిలనవ్వుచోఁ బుష్పములు వికసించినట్లుండెను. తండ్రీ! అతని తేజము, తపము, వ్రతము అవన్నియు నలౌకికములే. అతని బ్రహ్మచర్యవ్రతము పేరేమి? ఏయనుష్ఠానము ద్వారా అతఁడిట్టి తేజమును సంపాదించినాఁడు. నేనుగూడ అతనితోఁగూడి అట్టితపస్సు నే చేసి అట్టి తేజమును బొందెదను.

తండ్రీ! అతఁడు నవ్వుచు నాదగ్గఱకు వచ్చినాఁడు. నేతనికిఁ బ్రణామమొనర్పఁ దలఁచితిని. పాదార్ఘ్యములను నీయఁ దలఁచితిని; కాని అతఁడు నాప్రణామమును స్వీకరింపలేదు. నేనొసంగిన పాదార్ఘ్యములను స్వీకరింపలేదు. నేనొసంగిన నేరేడుపండ్లను, పిచ్చులములను, బిల్వఫలములను, ఉసరిక

పంపెను. సీతాఫలము మొదలగు ఫలముల నాతఁడు గ్రహిం
పక దూరముగఁ బాఱవైచెను. అంతనాతఁడు తనసంచి నుండి
గుండ్రముగానుండు చిన్న చిన్న విచిత్రఫలములను దీసెను. ఆశ్చ
ర్యమేమనఁగా తండ్రీ! ఆతని ఫలములకుఁబైన పెచ్చులేదు.
గింజగాని, కేఁమగానిలేదు. వాని రుచి అలౌకికమునుండెను.
అమృతోపమానములగు నాఫలములు కంఠమున నిలుచుట
లేదు. వానిని నోటనుంచుకొనఁగానే నాలుకయందు నోరూ
రును అవి వెంటనే మింగుడు పడిపోవును. వానినన్నిటినిఁ
దిన్నను దృప్తి జనింపదు వానిచే పండ్లును బులియవు. చిత్త
మును విసుగుచెందదు. పండ్లతోఁబనిలేదు. పెదవులుదాటఁ
గానే అవి కరిగిపోవును. వానికవియే క్రిందకుఁబోవును. అంత
నాతఁడు తన కమండలువును దీసెను. అది మన కమండలువు
నకు భిన్నముగనుండెను. అది మిక్కిలి మెఱయుచుఁగొంచెము
పొడుగుగనుండెను. దానినోరుచిన్నది. అది యేదో వస్తువుచే
మూయఁబడియుండెను. దానిని దెఱచి దానినుండి ఆతఁడొక
పేయపదార్థము నొసంగెను. దానిఁ ద్రావఁగనే నాకీభూమి
యాకసము దిఱుగుచున్నట్లుండెను. చిత్తమందు స్ఫూర్తియు
త్పన్నమయ్యెను. ఇంద్రియములందు మాదకత్వము వ్యాపిం
చెను. విచిత్ర పరిస్థితికలిగెను. తండ్రీ! అతనివద్ద బిల్వఫలము
వలె నొక ఫలముకలదు దానినాతఁడు నేలమీఁదఁగొట్టఁగా నది
యెగిరినది. అతఁడు దానిని మధ్యలోనే చేతులనుజాపి పట్టుకొ

నును. మరలఁగొట్టును, మరలఁబరువిడి దానిఁ దెచ్చును. ఈవిధముగ నాతఁడు చాలసేపటివఱకు నాతోఁ గ్రీడించెను. అతఁడు మాటిమాటికిని నన్నుఁ గౌఁగిలించుకొనును. అప్పుడు దానివలన నాకు మిక్కిలి సుఖముగ నుండెడిది. చాలసారులా తఁడు నాముఖముపైఁ దనముఖమునుబెట్టి, అవ్యక్తమగు నొకశబ్దమును గావించెను, దానివలన నాకు రోమాంచమయ్యె డిది. తండ్రీ! ఆమహాత్ముఁడు చాలమంచివాఁడు. అతఁడు నవ్వుచు నవ్వుచు నాతో సంభాషించుచుండును. నన్నెక్కు వగఁ బ్రేమించెడువాఁడు. అతని నడక, వైఖరి, రూపము, కూర్చుండుట, నిలుచుండుట, అవలోకనము, నవ్వు, క్రీడ, వేదగానము, నృత్యము—అన్నియును మోహకములుగను విచిత్రములుగను నున్నవి. అతని జడలనుండి పుష్పములు రాలె డివి. అతఁడు చాలసేపటివఱకు నాకడనే యుండెను. నాయనా! నామనస్సాతని వెంటనుండఁగోరి నడుకొనుచున్నది. అతఁడు వెడలి నప్పటినుండి నామనస్సు మిక్కిలి విచారము చెంది నది, శరీరము విరుప్పగానున్నది. ఒక్కక్షణమైనను నాతఁడు నామనస్సులో లేకుండఁడు. నేనును నాతనివలెఁ దపస్సును జేయఁగోరుచున్నాను ”

అమాయకుఁడును, నేమియును దెలియని వాఁడునగు తన పుత్రుని నోటినుండి యీవాక్యములన్నిటిని విని, ఒకా నొక కులట తన పిల్లవానిని మోసగింప వచ్చినదను సంగతిని

ముని గ్రహించెను. అయ్యో! ఈతనికొఱకై నేనెన్నో ప్రయ
త్నము లొనర్చితిని. సమస్తమును వ్యర్థములయ్యెనే నాకుమా
రుఁడు స్త్రీస్వభావ దూరముగ నుండవలయునని నేననుకొం
టిని. ఇప్పుడొకసారి యీతఁడు దాని ననుభవించినాఁడు.
యిఁకఁ దీనిని రక్షించుట అసంభవము. అయినను నాతఁడు
తన పుత్రునకు స్త్రీజ్ఞానమును గలుగఁజేయనీయలేదు. వయ
స్సునందున నాబాలకుని నజ్ఞానమందే యుంచుటకు నాతఁడిట్ల
నెను:- "వత్సా! ఆతఁడు తపస్వియైనను గాఁడు, రాక్ష
సుఁడు. రాక్షసులు యిట్టి మాయావులుగ నుందురు. నాన
విచిత్ర విచిత్ర వేషములను ధరించి కుపథములకు గొనిపోవు
చుందురు. మరల నెన్నఁడైన నిట్టి వేషముల రాక్షసులు వచ్చి
నచో వారిని దాకరాదు. పెద్దపెద్ద జడలు కలిగియుండి,
మూతిమీఁద గడ్డములును, మీసములును లేక, కంఠమునకుఁ
గ్రింద వక్షస్థలమున మాంసపిండములున్నచో నట్టివారినంద
ఱను మోసపు రాక్షసులని భావింపవలయును. ఆఫలములు
విషఫలములు వాని నెన్నఁడును దినరాదు. ఆ రాక్షసి నీకొసంగిన
పేయపదార్థము తపస్వుల కపేయము; దానివలన తప, స్తేజ,
ధర్మకర్మలన్నియును నష్టములగును. నీవు పొరపాటున నైనను
మరల నెన్నఁడును దానిని ద్రావరాదు. రాక్షసుల విషయ
మున జాగ్రత్తగ నుండవలయును వారినిఁ దాకినను పాపము
సంభవించును. అయినదేమో అయినది. గంగాస్నానమున

ర్చుము. గాయత్రిని రెట్టింపుగా జపమొనర్చుము. సాయంకాలీన అగ్నిహోత్రమును గావింపుము. ఆ రాక్షసుని మఱచి పొమ్ము."

పుత్రుఁడు తండ్రితో మాత్రము 'సరియే' యనెను గాని ఆతఁడామెను మనస్సులో మఱవఁజాలకుండెను. ఒక్కసారి ఒక్కసుఖము ననుభవించినప్పుడు తీవ్రవైరాగ్యము లేక దానిని మఱపించలేము.

విభాండక మహర్షికి మిక్కిలి చింతకలిగెను. ఆతనికి రాత్రి నిద్రపట్టలేదు. ఆతఁడు తెల్లవారంగనే ఆవేశ్యను వెదకఁబోయెను. ముని తనను వెదకుచున్నాఁడని ఆమె తన గుప్తచారులవలనఁ దెలిసికొనెను. అందువలన నామె మూఁడు దినముల వఱకు దాఁగియుండెను. మునికి వనములో నెవరును దొఱకక పోవునప్పటికి ఆతఁడు నిరాశను జెందెను.

మూఁడవదినమున నాతఁడు కుశసమిధలను దెచ్చుటకు వనమునకుఁబోఁగానే వేశ్యాపుత్రి మరల ఋష్యశృంగుని సమీపమునకు వచ్చెను. ఆమెను జూడఁగానే మునిపుత్రునకు రోమములు నిక్కపొడిచెను. ఆతఁడుల్లాసముతో నిట్లనెను:- "మునివరా! నీవీమూఁడు దినములనుండి యెచ్చట నుంటివి? నాకు నీవు లేకున్న క్షణక్షణమును భారముగనున్నది. నీతపస్తేజ బ్రహ్మచర్య వ్రతములకు నేనుమిక్కిలి ప్రభావితుఁడ

నైతిని. నా ప్రాంతికి నీవు వచ్చుట యిష్టములేదు. కావున దయ యుంచి ఆతఁడు తిరిగి రాకపూర్వమే నీవు నన్ను నీయాశ్రమ మునకుఁ గొనిపొమ్ము. నీయాశ్రమమును జూడవలయునని నాకు మిక్కిలి కోరికగనున్నది.”

వేశ్యకు గావలసినదిదియే ఆమె వెంటనే మునిపుత్రుని వెంటఁబెట్టుకొని పోయెను. నౌక దగ్గఱకు రాఁగానే ఆమె మునిని దానియందుఁ గూర్చుండఁబెట్టి, పల్లెవాండ్రతో మెల్లగా పడవను విడువుఁడని చెప్పెను. పడవవాండ్రు నౌకను వదలిరి. గంగయొక్క ఉత్తాలతరంగములను జీల్చుకొనుచు నౌక ప్రవాహమునఁ బోవుచుండెను. వేశ్య వివిధవిధముల పాడి యును, నానావిధముల హావభావములను జూపియును మధుర ములును, కర్ణప్రియములునగు నాయామాటలను జెప్పుచు ఋష్యశృంగ మహాముని మనస్సును నానందింపఁ జేయుచుం డెను. తాను దేవలోకమునకు వచ్చినట్లు ఋష్యశృంగుఁడు భావించుచుండెను. తాళస్వరయుక్తమును, మధురకంఠముతో సకలగానమును వినియును, నానాభావ భంగిమములను సద్భుత నృత్యమును, వివిధవాద్యముల సుందరస్వరమును విని ముని ముగ్ధుఁడయ్యెను. చాలసార్లాతఁడు మధ్యలోఁ దండ్రిని స్మరిం చెను, కాని వేశ్యలాతనికాయా మాటలను జెప్పి మఱపించిరి.

సూతుండిట్లనెను:- "మునులారా! ఈవిధముగ వేశ్యలు వివిధోపాయములచే విభాండక మునియొక్క అమాయకపు పుత్రుని మాయచేసి తెచ్చిరి. ఈసమాచారము నంగదేశాధిపతియగు రోమపాదుడు వినంగానే ఆతని హర్షమునకు మేర లేకుండెను.



# రోమపాదుని వంశజులు.

(౭౦౧)

శ్లో॥ ప్రజామదాద్దశరథో యేన లేభేఽప్రజాః ప్రజాః।
చతురంగో రోమపాదాత్పృథులాక్షస్తు తత్సుతః॥

శ్రీభాగ. ౯ స్కం. ౨౩ అ. ౧౦ శ్లో॥

ఆ॥ ఆనృపాల చంద్రుఁడనపత్యుఁడై యుండ
నెఱిఁగి మునికులేంద్రుఁడింద్రుఁ గూర్చి
యిష్టిసేసి సుతుల నిచ్చె నాతనికృపఁ
బంక్తిరథుఁడు పిదపఁ బడసె సుతుల॥

వ॥ ఆరోమపాదునకుఁ జతురంగుండును జతురంగునకుఁ బృథులాక్షుండును నుదయించిరి.”

శ్రీమదాంధ్రభాగవతము.

ఎంతటి కామాతుర పురుషునకైనను వానికత్యంత క్రోధమును దెప్పించినచోఁ గ్రోధావేశమందాతనికిఁ గామ వాసన నశించిపోవును. ఇదేవిధముగఁ గ్రోధావిష్టునకుఁ దన కామవానుసారముగ మోహాకవస్తువులను జూపించినచో వాని క్రోధమునశించును. క్రోధ మొకవిధమగు నగ్ని. అగ్ని యెట్లు జలముచే శాంతించునో అట్లే క్రోధాగ్ని శుచియును, సుంద

రమును, పవిత్రమును, సజ్జ్వలమును, మోహకమును, శృంగార రసయుక్తముసగు వస్తువులను గాంచినశాంతించును. క్రోధియుండగు క్రోధమును జూపిన నాతని క్రోధము వృద్ధి జెందును. చిత్తమున కనుకూలపరిస్థితి యుండినఁజిత్తము నీరు నీరై పోఁగలదు. అప్పుడు తానుజేసిన దానికిఁ బశ్చాత్తాపమును జెందును.

సూతుఁడిట్లనెను:- "మునులారా! అంగదేశ సమీపమునకు రాఁగానే వేశ్య తననావను నిలిపెను మునిపుత్రుఁడిట్లనెను:- "మునులారా! ఇప్పుడు మనమెచ్చటికి వచ్చితిమి?"

వృద్ధవేశ్య యిట్లనెను:- "ఆయుష్మంతా! ఇప్పుడు మనము మాయాశ్రమ నికటమునకు వచ్చితిమి. రండు, మాయాశ్రమమును దిలకింపుఁడు.'' ఇట్లు పలికి ఆమె మునిని శేవులోదింపెను ఈసమాచారమును దెలిసికొని రోమపాద మహారాజు వేలకొలఁది బ్రాహ్మణులను, మునులను వెంటఁబెట్టుకొని ఋష్యశృంగ మహామునికి స్వాగతమొసంగ విచ్చేసెను. అతఁడు పాద్యార్ఘ్యముల నొసంగి, భక్తియుక్తముగ మునికి స్వాగతమొసంగి. ఆతనిని జాలవైభవముగ రథమందుఁ గూర్చుండఁబెట్టి తనరాజధానికిఁ గొనిపోయెను. మునిపుత్రుఁ డెన్నఁడును నగరమును జూచియుండలేదు. అతఁడు రాజధానిలోని వైభవమును, జనసమ్మర్దమును, స్త్రీపురుషులను, గొప్ప

గొప్ప భవనములను గాంచి చకితుఁడయ్యెను. రాజపురోహితుఁడు ఋష్యశృంగునకు సమస్త ప్రవృత్తి మార్గములను జెప్పెను, రాజు మిక్కిలి ఆదరసత్కారములతో మునిపుత్రునిఁ దనకడనుంచుకొనెను. ఆతఁడచ్చటకు రాఁగానే యింద్రుఁడు వర్షమును గురిపించెను. ఎటుఁజూచినను జలమే కనఁబడుచుండెను. మరుభూమివలె శుష్కముగ నున్న భూమి వర్షము కురియుటచే సస్యశ్యామలమయ్యెను. సర్వత్ర పచ్చని గడ్డియును, గొల్లగ ధాన్యమును గనఁబడెను. రాజు పరమసుందరియును, సత్యాంత సుకుమారియును, గారాబు బిడ్డయునగు శాంతాదేవిని ఋష్యశృంగునకిచ్చి వివాహము కావించెను ఇది మునికాదు మనోహారిణియగు భగవన్మాయా స్వరూపిణి యనిఅప్పుడాతఁడు తెలిసికొనెను. ఇంతటి సుందరియగు భార్యనుగాంచి ముని అత్యంతానందమును జెందెను. ఆతఁడు రాజభవనమున సమస్త సుఖోపభోగ సామగ్రిని, సత్కారములనుబొంది శాంతతో గృహస్థధర్మమును బాలించుచుండెను. ముని యెట్లమాయకుఁడో, శుద్ధహృదయుఁడో హరిణ నేత్రములుకల శాంతయును నమాయకస్త్రీయే. శాంతాదేవి తన తనువు, మన, ధనములతోడను, సర్వస్వమును ముని చరణములకు సమర్పించెను. ఆమె నిష్కపట భావముతోఁ దన పతి పరమేశ్వరునిఁ బరిచర్యచేయసాగెను. తన సేవాశుశ్రూషల చేతను, వినయముచేతను అనుకూలాచరణముచేతను నామె

మునిని దన వశము కావించుకొనెను. వనమును వదలిపోవు నట్టి మునియును నామె ప్రేమపాశమున బంధింపఁబడెను.

ఇప్పుడు విభాండక మహాముని తిరిగివచ్చి ఆశ్రమమునకు రాఁగానే అతనికి తనపుత్రుఁడు కన్పించకపోవుటచేఁ బరమ విస్మితుండయ్యెను. వెంటనే అతఁడు తనపుత్రుని నెవరో మోసగించిరని యనుమానించెను. అతఁడు దగ్గఱయున్న మునుల యాశ్రమముల నన్నిటిని వెదకెను. కాని పుత్రుని జాడ తెలియలేదు. అతఁడు మిక్కిలి క్రోధముతోఁ దనపుత్రుని వెదుకుచుండఁగా నొకవృక్షముని నవ్వి యిట్లనెను:– "నగరమునకుఁ బోయి చూడుము. నీకొడుకు నెవరును విక్రయింపలేదు."

ముని కనులెఱ్ఱఁజేసి యిట్లనెను:– "నాపుత్రుఁడమ్మఁదగిన వస్తువా యేమి?"

వృక్షముని యిట్లనెను:– "నీవు నీకొడుకును నీకాట వస్తువుగఁ జేసికొనినావు. అతనికి సాంసారిక జ్ఞానము నొసంగలేదు. ఎవరితోఁ గలియనీయలేదు. అతనిఁ బ్రపంచమునకుఁ దెలియకుండఁజేసితివి. అజ్ఞానములోఁ ద్యాగము లేదు. జ్ఞానపూర్వకమగు త్యాగమే నిజమగు త్యాగము. అంధకారమును జూచిననే ప్రకాశముయొక్క మహత్త్వము తెలియనగును. రాత్రియొక్క జ్ఞానము కలిగిననే దినముయొక్క ఉపయోగము బుద్ధికి రాఁగలదు. ప్రవృత్తి మార్గముయొక్క

బ్రహ్మచర్యము చేసిన నివృత్తి మార్గము యొక్క ఉత్తమత్వమును గ్రాహ్య మొనర్చియుండగలవు కదా? స్వాభావిక ప్రవృత్తులను హత ప్రాకృతముగ నెవఁడు నివారింపగలఁడు? సమావర్తనము, వివాహ మొనర్చుకొని ప్రత్యేకముగ స్త్రీ పరిచయము నొనర్చుక నీవు హాని యొనర్చితివి. తపఃఫల స్వరూపముగ నంగదేశము నందు వర్షము కురియుచేసు. నీవంగరాజు కడకుఁబోయి నీవు ప్రతి హానిని దెలిసికొనుము"

ఇదంతయును నంగదేశపు రాజు యొక్క పన్నాగమని విభాండమునికిఁ దెలిసెను. అతఁడు క్రోధోద్రిక్తుఁడై శాప మొసంగుట కుద్యుక్తుఁడయ్యెను. అంత మునులందఱును జేరి అట్లొనర్ప చేయుట నడ్డగించిరి. శాస్త్రీయ ప్రమాణము నాధారముగా వారేతనికి నచ్చఁజెప్పిరి:– "నీవిట్లొనర్చుట అనుచితము నీవు ముందుగా నంగరాజు కడకుఁబోయి సమస్త విషయములను దెలిసికొనవలయును. వారి విషయముల నన్నిటిని విని నీకెట్లు తోఁచిన నట్లు శాపమో వరమో యొసఁగుము."

మునుల వాక్యములను విని విభాండకముని క్రోధోద్రేకుఁడై అంగదేశపు రాజధానియగు జంపాపురము (చంపారణ్యము) నకుఁబోయెను. ఈపన్నాగములో మునులకును భాగమున్నదని తోఁచుచున్నది. విభాండక మహాముని క్రోధమున వచ్చుచున్నాఁడను సంగతి రాజునకు ముందుగఁదెలి

ఋష్యశృంగ మహాముని యిట్లనెను. "నేను నిష్ఠా-
క్రమముగ బ్రహ్మచర్య వ్రతమును పాలించి వేదాధ్యయనము-
గావించితిని. నేను ఋత్విజుఁడనై ప్రభావముచేత యెందరికో
గాఁగల పుత్రేష్టిని జేయించెదను. అతనివలన మహారాజు-
నకుఁ బుత్రప్రదానము గావింపఁగలను."

ఇది వినఁగానే శాంత హర్షమునకు మేర లేకుండెను. ఆమె
యీ వృత్తాంతమును దన తల్లిదండ్రులకుఁ జెప్పెను. రాజంతట
వేదజ్ఞులగు బ్రాహ్మణులను జాలమందిని పిలిపించి యజ్ఞము-
నకు కావలసిన యేర్పాటులన్నిటిని గావించెను. మిక్కిలి వైభ-
ముగ యజ్ఞము జరిగెను. ఆ యజ్ఞఫలము వెంటనే ఫలించెను.
ఇంద్రుఁడు ప్రసన్నుఁడై రాజు పుత్రవంతుఁడగు నట్లాశీర్వ-
దించెను. మహారాణి గర్భవతియై నియత సమయమునకు ఆమె
ఒక పుత్రరత్నమును బ్రసవించెను. రాజా కుమారునకుఁ జతు-
రంగుఁడను పేరును బెట్టెను. చతురంగుఁడు శుక్లపక్ష చంద్రు-
నివలె దినదిన ప్రవర్ధమానుఁడగు చుండెను.

తన పుత్రికయగు శాంతయొక్క భర్త పుత్రేష్టిఁ జేయిం-
చుటలో మిక్కిలి నిపుణుఁడను విషయమును నయోధ్యాధి-
పతియగు దశరథ మహారాజునకుఁ దెలియఁగానే ఆతండును
ననునయ వినయములను గావించి శాంతాసహితుఁడైన
ఋష్యశృంగునిఁ దనకడకు పిలిపించుకొనెను. రాజయొక్క

బలవంతము చేతను, వశిష్ఠుని సమ్మతిచేతను దశరథుని చేత గూడ ఋష్యశృంగ మహాముని పుత్రకామేష్టిం జేయించెను. దానికి ఫల స్వరూపముగ దివిజుల మంచినుండు, కౌశల్యానంద వర్ధనుండును విష్ణ్వంశసంభూతుండగు రామచంద్రుడును, కైకకు సాకార స్వరూపుడగు భరతుండును, సుమిత్రానంద వర్ధనులగు లక్ష్మణ శత్రుఘ్నులును జన్మించిరి

శాంతకు పుత్రుండు పుట్టగానే మునిపుంగవుడగు ఋష్యశృంగుండును రాజుకడ బహుమతులం బొంది మరల వనమునకుం బోయెను. అప్పుడాతండంగ దేశమును వదలి గంగాతీరమున కాన్యకుబ్జదేశమునకు వచ్చి నివసింపసాగెను, శాంతయును రాజభవనమును విడి ఆతనితోడనే నివసించుచు నాతని సేవించుచుండెను. ఋష్యశృంగ మహర్షి యొక్క ఆశ్రమము కాన్యకుబ్జదేశమందు గంగాతటమున ఫరూకాబాదు జిల్లాలో శృంగిరామపురమను పేర నిప్పటికిని గలదు అచ్చట గొప్ప యుత్సవము జరుగుచుండును.

ఈవిధముగ రోమపాదుని పుత్రిక ఋష్యశృంగునిం బెండ్లాడెను. మహారాజు పుత్రుండగు చతురంగుడు మిక్కిలి ధర్మాత్ముండును గుణగ్రాహియునై యుండెను. ఆతని పుత్రుండు పృథులాక్షుండు. పృథులాక్షుని పుత్రులు బృహద్రథుండు, బృహత్కర్మ, బృహద్భానువను ముగ్గురు పుత్రులు కలరు.

వారిలో నందఱిలోఁ బెద్దవాఁడైన బృహద్రథునకుఁ బుత్రుఁడు బృహన్మనుఁడు. అతనికి జయద్రథుఁడును, జయద్రథునకు సంభూతియను భార్యయందు విజయుఁడను పుత్రుఁడుదయించెను. విజయునకు ధృతి, ధృతికి ధృతవ్రతుఁడు. అతనికి సత్కర్మ. ఆసత్కర్మని పుత్రుఁడే సూతరాజగు అధిరథుఁడు.

అధిరథునకు సంతానము లేదు. ఒకదినమున నాతఁడు గంగాస్నాన మొనర్చుచుండఁగా నాతనికి గంగాప్రవాహమున నొక పెట్టె కొట్టుకొని పోవుచుండెను. పట్టుకొని యాతఁడా పెట్టెను తెఱపించెను. దానిలో నొక సుందర బాలకుఁడుండెను. ఆతని శరీరకాంతి దేవకుమారునకువలె నుండెను. కర్ణములందాతనికి స్వాభావిక దివ్యకుండలములుండెను. రాజాతనినిఁ దన యింటికిఁ గొనివచ్చి వానినిఁ దన పుత్రునిఁగా భావించుచు వానినిఁ బోషించుచుండెను. ఈతఁడు కన్యావస్థయందు కుంతీగర్భమున సూర్యభగవానుని ద్వారా ప్రసవించిన కానీనపుత్రుఁడు. రాజాతనిఁ దన పుత్రునిఁగా భావించెను. ఆతనిఁ దనపత్నియగు రాధకొసంగెను, అందువలనఁ గుంతీ పుత్రుఁడగు కర్ణుఁడు రాధేయుఁడనఁబడెను, అనంతరము అధిరథునకు పుత్రులింకను కలిగిరి. కర్ణునకును జాలమంది పుత్రులుదయించిరి. వారిలో వృషసేనుఁడు ముఖ్యుఁడు. ఇట్లాతని వంశము విస్తరించెను. దానినెంతని చెప్పఁగలను. వ గ

దేశమునందును, విదేశమునను, పృథివియందును నిప్పటికిని చాలమంది సత్త్వసంశ్రేష్ఠులగు కాయస్థులు కలరు.

సూతుండిట్లనెను:- "మునులారా! ఈవిధముగ నత్యంత సంక్షేపముగ నేను యయాతి మహారాజుయొక్క చతుర్థ పుత్రుండగు పురువంశ వర్ణనము గావించితిని. ఇప్పుడింకఁ ద్వితీయపుత్రుండగు ద్రుహ్యుని వంశమును నతి సంక్షేపముగ వర్ణించెదను వినుండు."



# ద్రుహ్యు తుర్వసు వంశజులు.

(౭౦)

శ్లో॥ ద్రుహ్యోశ్చ తనయో బభ్రుః సేతుస్తస్యాత్మజస్తతః
ఆరబ్ధస్తస్య గాంధారస్తస్య ధర్మస్తతో ధృతః

శ్రీభాగ ౯ స్కం. ౨౩ అ. ౧౪ శ్లో:

"వ..... ద్రుహ్యునకు బభ్రుసేతువు బభ్రుసేతువునకు నారబ్ధుండు నారబ్ధునకు గాంధారుండు గాంధారునకు ధర్ముండు ధర్మునకు ధృతుండు నుదయించిరి."

శ్రీమదాంధ్ర భాగవతము.

ఏకులమందొక భగవద్భక్తుఁడు దయించినాఁడో ఆతఁడు తనవంశమునకటు యేడుతరములును నిటు యేడుతరములును, నేడు మాతృకుల తరములను దరింపఁజేయును. అట్టియెడ నేకులమందైనను భక్తభావనుఁడగు వాసుదేవ భగవానుఁడు ప్రకటమైనచో నిఁకఁ జెప్పవలసినదేమున్నది? ఆకుల మంతయును ధన్యమగును. సూర్యవంశమున కింతటి మహిమ యేలవచ్చినది? దానిలో రవికుల తిలకుఁడగు శ్రీరాఘవేంద్రుఁడవ తరించుట చేతనే. ఆజన్ముఁడయ్యును నాతఁడు సూర్యవంశమున జన్మించెను. అందువలన నాకులము పరమపావనమైనది,

చంద్రవంశమునకు నింతయే చంద్రవంశమందొకరికి మించిన వారొకరుగ శూరవీరులును, యశస్వులును, ప్రతాపవంతులగు రాజులుండినను, వారందఱును మరణధర్మము కలవారే. ఈవంశమునకు మహత్త్వము యాదవేంద్రుడగు శ్రీకృష్ణచంద్ర భగవానుని యవతార కారణముగ గలిగెను. యయాతి జ్యేష్ఠ పుత్రుడగు యదుమహారాజు తండ్రిశాపముచే క్షత్రియత్వ హీనుడైనను భగవంతుడవతరించుటచే దేవతలకుగూడ ఆకులము పరమ వందనీయమైనది. భగవంతుని సంబంధముచే సమస్త యాదవుల కులములన్నియును పరమ కీర్తనీయములైనవి.

సూతుడిట్లనెను:- "మునులారా! నేను యయాతి యొక్క పంచమ. చతుర్థపుత్రులగు పూరు, అనువంశములను గూర్చి చెప్పితిని. ఇప్పుడత్యంత సంక్షేపముగ నాతని తృతీయపుత్రుడగు ద్రుహ్యునివంశమును గూర్చి చెప్పెదను. వీరు హిమాలయముల కీవలనావలగల అనార్యమ్లేచ్ఛ (పార్వత, టిబ్బతు, కాబులు, కంధారము, రష్యా. చీనా, జపాను) దేశములకు రాజులైరి. వీరు వర్ణాశ్రమ దేశపు హద్దుల కావలనుండుటచే సంస్కారహీనులైరి మ్లేచ్ఛసంసర్గముచే వారితో వివాహాది సంబంధములను జేసికొనుటచే వీరును మ్లేచ్ఛప్రాయులైరి. కావున నీకులములో గొందఱు రాజులనుగూర్చియే నామమాత్రముగ జెప్పెదను.

చున్నారు. ఈ వంశము క్రమముగ భారతదేశపు సరిహద్దు సంస్థానములను పాలించుచున్నది. నేనిప్పుడు యయాతిపుత్రుఁడగు ద్రుహ్యు వంశమును వర్ణించితిని. ఈ వంశము శర్మిష్ఠకుఁ బుట్టిన యయాతి యొక్క మూఁడవ కుమారుల వంశమును నేను జెప్పితిని ఇప్పుడు దేవయాని వలనఁ బుట్టిన యయాతియొక్క ద్వితీయ పుత్రుఁడగు తుర్వసుని వంశముఁ జెప్పెద వినుఁడు.

తుర్వసు మహారాజు కుమారుఁడు వహ్ని, వహ్ని పుత్రుఁడు భర్గుఁడు. భర్గునకు భానుమంతుఁడు జన్మించెను. భానుమంతుని పుత్రుఁడు త్రిభానుఁడు. ఈ త్రిభానునకే పరమ యశస్వియును, ఉదారబుద్ధియునగు కరంధమ మహారాజుద యించెను ఈ కరంధముని పుత్రుఁడే మరుత్తుఁడు. ఆతఁడు గొప్ప యజ్ఞమును గావించెను. ఆతనికి సమానముగ వైభవ పూర్ణమగు యజ్ఞము గావించిన రాజింతవఱకును లేఁడు. ఈ మరుత్తుఁడు పుత్రహీనుఁడయ్యెను. ఈతఁడు పురువంశీయుఁడగు దుష్యంతునిఁ బుత్రునిగా భావించెను, ఆతనికి ముందుగాని వెనుకగాని తండ్రికి వేఱుగాఁ బుత్రులు లేకపోవుటచే నీతఁడు రాజ్యలోభముచే మరలఁ బూరువంశమందే కలిసిపోయెను. తరువాత నీతని వంశము నడిచినది లేనిది తెలియుటలేదు.

ఇది విని శౌనకుఁడిట్లనెను:- "సూతా! ఇప్పుడు తెలియనిండు తెలియకపోనిండు మేమీ వంశావళిని వినివిని విసుగున

# యదువంశ వర్ణనము.

శ్లో॥ యయాతేర్జ్యేష్ఠ పుత్రస్య యదోర్వంశం నరర్షభ।
వర్ణయామి మహాపుణ్యం సర్వపాపహరం నృణామ్॥
యదోర్వంశం నరః శ్రుత్వా సర్వపాపైః ప్రముచ్యతే।
యత్రావతీర్ణో భగవాన్ పరమాత్మా నరాకృతిః॥

శ్రీభాగ. ౯ స్కం. ౨౩ అ. ౧౮-౧౯ శ్లో॥

చ॥ అనఘ యయాతి పెద్దకొడు
కైన యదుక్షితిపాలు వంశమున్
వినినఁ బఠించినన్ నరుఁడు
వెండియుఁ బుట్టఁడు ముక్తిఁ బొందు న
య్యనుపమమూర్తి విష్ణుఁడు న
రాకృతిఁ బొంది జనించెఁ గావునన్
వినుము నరేంద్ర నావలుకు
వీనులు పండువు గాఁగఁ జెప్పెదన్॥

శ్రీమదాంధ్ర భాగవతము.

ఏకులమందు భగవదవతారము వచ్చినదో ఆకులమత్యంత పావనమైనదియును, సర్వశ్రేష్ఠమునై యున్నది. భగీరథుఁడు తన తపోబలముచే గంగను భూతలమునకుఁ దెచ్చి

నాఁడు; కాని దానిలో సగర చక్రవర్తి అసమంజసుఁడు. అంశుమంతుఁడు, దిలీపుఁడు వీరందఱయొక్క తపస్సును శౌర్యమును సమ్మిళితమైయున్నది. అయినను తామందు భగవత్ త్రిపథగామినియగు గంగ ప్రసన్నయై భక్తవరుఁడగు భగీరథుని వెంటవచ్చినది. ఆదేవిధముగ శ్రీదేవకీ వసుదేవులయొక్కయు నంద యశోదలయొక్కయు పుణ్యప్రభావముచేఁ శ్రీకృష్ణుఁడవతరించెను, కాని యిందులో యదువంశములోని సమస్తరాజుల పుణ్యము సమ్మిళితమైయున్నది. ప్రభు ప్రాప్తి కేవల పుణ్యము వలనఁగాని, ఇంకేసాధనము వలనఁగాని కాదు. ఆతఁడు స్వయముగ ననుగ్రహించి యేకులమును పావనము చేయఁదలఁచునో ఏవంశమునకు గొప్పతన మొసఁగఁదలఁచునో దానిలోఁ బ్రకటమగును. ఆతని నేసాధనలును బంధింపఁజాలవు. ఆతఁడు ప్రేమపాశమున బంధింపఁబడి నాట్య మొనర్పఁగలఁడు. ఈ అష్టావింశతి మన్వంతరమున ద్వాపరయుగాంత మందాతఁడు యదుకులము ననుగ్రహించెను. అందువలన నిప్పుడు యదుకుల చరిత్రము చెప్పఁబడుచున్నది,

సూతుఁడిట్లనెను:— "మునులారా! ఇప్పుడు నేను యయాతి మహారాజుయొక్క జ్యేష్ఠ శ్రేష్ఠ పుత్రుఁడును, శుక్రతనూజయగు దేవయాని గర్భమునఁ బ్రథమమున జనించినవాఁడునగు యదువంశవర్ణన మొనర్చెదను. ఆవంశమందే అజన్ముఁడగు వాసుదేవుఁడు నరరూపమున నవతరించినాఁడు.

యయాతి దేవయానుల కేవిధముగ యదువు జన్మించి నదియును, ఏవిధముగాఁ దండ్రికొరకై వృద్ధావస్థను గ్రహిం చెనో, ప్రతిఫలమే క్షత్రియత్వాభిషిక్తతను గాంచినదియును నేనీ ప్రసంగమున యయాతి చరిత్రమందును జెప్పియుంటిని. ఇప్పుడాతని తరువాతి వంశమును వినుఁడు. యదుమహారాజు నకు నలుగురు కుమారులుదయించిరి. వారు చతుర్విధ పురుషా ర్థములలో, నాలుగు వేదములలో, నాలుగువర్ణములలో, నాల్గాశ్ర మములలో మూర్తీభవించినట్లుదయించిరి. వారి పేర్లు సహస్ర జిత్, క్రోష్ట, నల, రిపులనునవి వీరిలో సహస్రజిత్, క్రోష్టల యొక్క వంశములను వర్ణించెదను.

సహస్రజిత్ కుమారుఁడు శతజిత్తు. ఈశతజిత్తునకు ముగ్గురు కొడుకులుదయించిరి – మొదటివాఁడు మహాహ యుఁడు, రెండవవాఁడు వేణుహయుఁడు, మూఁడవవాఁడు హైహయుఁడు. వీరందఱిలోఁ జిన్నవాఁడును మూఁడవవాఁ డగు హైహయుఁడు మిక్కిలి పరాక్రమవంతుఁడును బ్రిభావ శాలియునై యుండెను. ఈతని పేరున హైహయవంశము నడ చెను. హైహయ వంశక్షత్రియులు మిక్కిలి బలవంతులుగ నెన్నఁబడుచుండిరి. హైహయునకు ధర్ముఁడును. ఆతనికి నేత్రుఁడనుదయించిరి. నేత్రుని పుత్రుఁడు కుంతి. కుంతికి సోహంజి, సోహంజికి పరమయశస్వియగు మహిష్మంతుఁడుద యించినాఁడు. ఆతఁడు నర్మదాతీరమునఁ దన నామముచే

అంతట రావణుఁడిట్లు పలికెను:- "సూతా! యదు వంశరాజులకు నష్టరాత్రి శాపముచేఁ జక్రవర్తి సింహాసనమునఁ గూర్చుండు నధికారము లేదుకదా? అట్టియెడ నితఁడేకఛత్రాధిపతి యెట్లాయెను."

దానికి సూతుఁడిట్లనెను:- "స్వామీ! శాప పాపముల బలము లేమియును జేయఁజాలవు. భగవంతుని కెవరి పూర్ణ కృపకలదో ఆతనికి శాపములన్నియును సమాప్తము లగును. వీరికి శాపమొసఁగినది వీరికులములోని మానవులే కదా! భగవంతుని అంశావతారుఁడును, నవధూతయనగు దత్తాత్రేయుని నితఁడు చాల శ్రద్ధతో సేవించియుండెను. అత్యధికముగ సేవాశుశ్రూషలొనర్చి యీతఁడు దత్తాత్రేయ భగవానుని ప్రసన్ను నొనర్చుకొని, ఆతని వలన యోగవిద్యను, సమస్తములగు నణిమాది సిద్ధులను బొందెను. దత్త భగవానుని కృపచేతనే ఆతఁడు వేయిబాహువులను బొందెను దత్త భగవానుఁడీతని నాశీర్వదించుచు నిట్లనెను:- "భగవంతుఁడు తప్ప యింకే క్షత్రియుండును నిన్ను యుద్ధమున జయింపఁజాలఁడు. సర్వత్ర నీకు విజయముకలుగును." అందువలన నితఁడే రాజుమీఁద యుద్ధమొనర్చినను నాతఁడు లొంగిపోవలసినదే. ఆతని సమ్ముఖమున నిలుచుట కెవరికిని సాహసములేకుండెను. చివరకు భగవంతుఁడు పరశురామ రూపమునఁ బ్రకటమై యీతనిని వధించినాఁడు. ఈశౌర్యైశ్వర్య సహస్రార్జునుఁడును

ఈ హైహయునివంశములో సంజాతుండై పెద్దవాఁడగు జయధ్వజునకుఁ దాళజంఘుఁడను గొప్ప ప్రభావశాలియును, బలియునగుఁ బుత్రుఁడుకలిగెను. ఆతనికి నూర్గురు కొడుకులుదయించిరి. వారందఱును దాళజంఘులు క్షత్రియులనఁబడిరి.

ఈ తాళజంఘులను క్షత్రియుల కాలములో నయోధ్యయందు సూర్యవంశీయుఁడగు బాహుక మహారాజు రాజ్యము చేయుచుండెను. వీరందఱు నయోధ్యమీఁదకు దండెత్తి, అయోధ్యారాజ్యమును జయించి తమ రాజ్యమందు గలుపుకొనిరి. బాహుకుఁడు తన భార్యలతోఁ గలిసి వనమునకుఁ బోయి ఔర్వమున్యాశ్రమమున నివసించుచుండెను. ఈతఁడు తన రాణి గర్భవతిగానుండఁగా మరణించెను. తరువాత నా రాణి గర్భమునుండి చక్రవర్తియగు సగరుఁడుదయించెను. సమర్థుఁడు కాఁగానే ఆతఁడు సైన్యమును గూర్చుకొని తాళజంఘుపైకి దండెత్తెను దానిలోఁ జాలమంది తాళజంఘులు చచ్చిరి. వారికి సహాయముగ వచ్చిన యవన, శక, బర్బర, హైహయాదులు సగరునిచే నోడిపోయిరి. వారందఱును సగరుని భయముచే భయభీతులరై ఆతని గురువగు నౌర్వుని సమీపమునకుఁ బోయిరి. గురువు సగరునితో వారికి ప్రాణదానమొసఁగుమనెను. సగరుఁడు వారినిఁ జంపక, ఆసమయమునఁ గల ఆచారము ననుసరించి వారిని వేదబాహ్యులను గావించి వర్ణాశ్రమ ధర్మమునుండి వెలివైచెను. వీరవర్ణాశ్రమ వేద

బాహ్యులగు ననార్యులని గుర్తింపఁ దగినవారుగ వారందఱును విచిత్రవేషములను ధరించిరి. తాళజంఘుని నూర్గురు పుత్రులలో నందఱికంటెఁ బెద్దవాఁడు వీతిహోత్రుఁడు. సగరచక్రవర్తి ఈతనివరాత్రియు దేశబాహ్యులైన ర్వాక పైతృకరాజ్యము నీతనికొసంగినట్లు తెల్పుచున్నది. ఆవీతిహోత్రుని పుత్రుఁడే మహాయశస్వియగు మధువు. ఈతని కారణముననే యదువంశ యాదవులను మాధవులనియును, మధు వంశీయులనియు సంజ్ఞయేర్పడినది. ఈమధువునకును నూర్గురు పుత్రులుదయించిరి. వీరు నూర్గురిలో వృష్ణియనువాఁడు జ్యేష్ఠుఁడును శ్రేష్ఠుఁడునై యుండెను. ఈవృష్ణి నామముననే యాదవులకు వృష్ణివంశీయులనియును వార్ష్ణేయులనియును పేరు వచ్చెను. యదువు, మధువు వృష్ణి-వీరికులమునందు ముగ్గురు పరమకీర్తిమంతులైరి: అందువలన నీవంశము వారిని యాదవులనియు, మాధవులనియు, వార్ష్ణేయులనియును పిలువఁబడుచుండిరి ”

సూతుఁడిట్లనెను:- “మునులారా! సంక్షేపముగ నేను యదుమహారాజుయొక్క జ్యేష్ఠపుత్రుఁడగు సహస్రజిత్తునివంశము లోని ముఖ్యముఖ్యులగు రాజుల నామములను చెప్పితిని. ఇప్పుడు నేను యదువుయొక్క రెండవ కుమారుఁడగు క్రోష్టువంశ వర్ణనము గావించెదను. దానిని మీరు సమాహితచిత్తులరై శ్రవణము చేయుఁడు ”

# మహాయోగి, మహాభోగి శశబిందు మహారాజు.

(౨౦౫)

శ్లో॥ స్వాహితస్తతో రుశేకుస్తస్య చిత్రరథస్తతః।
శశబిందుర్మహాయోగీ మహాభోజో మహానభూత్॥

శ్రీభాగ ౯ స్కం.. ౨౩ అ. ౩౧శ్లో॥

"వ.....స్వాహితునకు రుశేకుండు రుశేకునకు చిత్రరథుండు చిత్రరథునకు శశిబిందుండుం బుట్టెను."

శ్రీమదాంధ్ర భాగవతము.

కలికాలరూపమగు దావానలము యోగ, జ్ఞానసిద్ధులను భస్మము కావించినవి. అందువలననే కలియుగమందు యోగులును, జ్ఞానులును, సిద్ధులును, శక్తిమంతులును గానంబడరు. అందువల్లనఁ గలియుగమందలి క్షుద్రబుద్ధికలవారలకు యోగసిద్ధులందు వెంటనే విశ్వాసము జనింపదు. ఫలాని ఋషి పది వేల సంవత్సరములవఱకు తపమొనర్చినారు. ఫలాని రాజర్షి యెనుబదివేల సంవత్సరములవఱకు రాజ్యమొనర్చి నారనిననివి యతిశయోక్తులుగఁ దోఁచును. కాని యీ విషయము లసత్యములుకావు, అక్షరశః సత్యములు. మనలో శ్రద్ధావిశ్వాసము

అల్పముగనున్నవి మనుష్యుఁడేదైనను జేయఁగలఁడు. వానికి యోగశక్తు లనంతములుగఁ గలవు. ఆతనిలో నసంభవములకు స్థానము లేదు. అన్నియును సంభవములే. అసంభవములేమైన నుండిన నవిశ్వాసులును పండితమ్మన్యులునగు మూర్ఖులను విశ్వసించుటయే, శ్రద్ధ ముందు. విశ్వాసమునం దసంభవమను నది లేదు.

సూతుఁడిట్లనెను – "మునులారా! నేనత్యంత సంక్షేపమున యదుమహారాజు ప్రథమ పుత్రుఁడగు సహస్రజిత్ వంశమునుగూర్చి వర్ణించితిని. ఇప్పుడు మీరు ఆతని ద్వితీయ పుత్రుఁడగు క్రోష్టుని వంశమునుగూర్చి వినుఁడు. క్రోష్టుని పుత్రుఁడు వృజినవంతుఁడు ఆతనిపుత్రుఁడు స్వాహి. స్వాహికి రుశేకుఁడు. ఆతనికిఁ జిత్రరథుఁడు, చిత్రరథునకు బరమయోగియును, బరమ సామర్థ్యవంతుఁడును, విషయముల నవ్యాహతగతి ననుభవించువాఁడును, రాజరాజేశ్వరుఁడును, పరమైశ్వర్యశాలియునగు శశిబిందుఁడుదయించెను. మీరాతని యైశ్వర్యమును గూర్చియును. విషయభోగములను గూర్చియును వినినయెడల నాశ్చర్యచకితులయ్యెదరు. పృథివిపై మానవు లింతటి యైశ్వర్యశాలురెవరును గాఁజాలరు. ఇన్ని భోగముల ననుభవింపఁజాలరు."

శౌనకుండిట్లనెను:- "సూతా! శశబిందు మహారాజెంతటి ఐశ్వర్యశాలి? అతని ఐశ్వర్యమునుగూర్చి కొంచెముగ వర్ణింపుము."

సూతుండిట్లనెను:- "స్వామీ! నేనేమి వర్ణింపఁగలను? పృథివిపైఁ బదునాల్గు మహారత్నము లున్నవందురు. అనఁగా ఏనుఁగు, గుఱ్ఱము, రథము, స్త్రీ, బాణము, కోశము మాల, వస్త్రము, శక్తి, పాశము, మణి, ఛత్రము, విమానము— వీనికి మహారత్నములను సంజ్ఞ కలదు. ఈరత్నములన్నియును ఈతని కడ నగణితముగను, నసంఖ్యాకములుగను గలవు. ఏనుఁగులు లెక్కయే లేదు. అదేవిధముగ నశ్వములును, రథములును గలవు. ఈతనికడ నన్నియును దివ్యబాణములు కలవు. ఈతని కడనున్న సువర్ణమున కంతే లేదు, లెక్కలేదు. ఈతనిమాలలు దేవతల మాలలవలె దివ్యములు; అవి యెన్నడును వాడవు, జీర్ణములు కావు. ఈతని శక్తి పాశములలౌకికములు. మణి మాణిక్యములు కొట్లనిండను గలవు. అన్ని ఋతువులందు ననుకూలముగనుండు ఛత్రమీతనిది. ఈతనికడ నసంఖ్యాకములగు విమానములుకలవు. అవి ఆకాశమునఁ దిరుగుచుండును. ఈ రత్నములన్నిటిలో స్త్రీరత్నము సర్వశ్రేష్ఠముగఁ జెప్పఁబడినది. ఈతనికి రాణులు పదివేవురు. వారొకరికిమించిన నొకరు రూపవతులు సౌందర్యమందు స్వర్గస్త్రీలనుగూడ తిరస్కృతి నొనరింపఁగలరు."

ఇదివిని శౌనకుఁడిట్లనెను:- "సూతా! ఇది చాల ఆశ్చర్యకరమగు విషయము. ఒక్క పురుషుఁడు పదివేవురు స్త్రీల కెట్లు పతికాఁగలఁడు?"

ఇదివిని సూతుఁడిట్లనెను:- "స్వామీ! నేను నూటి నూటికిఁ జెప్పుచునేయున్నాను. సృష్టిలో నసంభవమనునది లేదు. మనబుద్ధిపైఁ దెలియపడినది, మనము మనసామర్థ్యమునకు మించిన విషయము నూహింపఁజాలనంతటి సంకుచితాంతఃకరణము కల వారలమైతిమి, ఈయనంత బ్రహ్మాండ యుతమైన విశ్వమందు దీని బ్రహ్మాండము మహాసాగరమున నొక్క బిందువంతైనను లేదు చతుర్దశ భువనయుతమగు బ్రహ్మాండము స్థితియే యట్లుండ సిఁక మానవుని అస్తిత్వమేమున్నది? ఒక కథకలదు. ఈ బ్రహ్మాండములోని బ్రహ్మగర్వమును జెందియిట్లనెను:- "నేను సృష్టి నొనర్తును. బ్రహ్మాండములోని పనియెట్లు జరుగఁ గలదో చూతము"

ఇంతలోనే ఆతఁడీ దృశ్యమును గాంచెను- చాలకంచర గాడిదలు బరువులు వేసికొని పోవుచుండెను. గర్వమును జెందిన బ్రహ్మ సమీపమునఁ గూర్చుండిన నొక వృక్షమునితో నిట్లనెను:- "మునివరా! ఇన్ని కంచరగాడిద లెచ్చటికి పోవుచున్నవి? వీనిమీఁద నేమి బరువును వైచినారు?"

ముని యిట్లనెను:- "ఓయీ బ్రహ్మ! ఈకంచర గాడిదలు విశ్వమందంతటను దిరుగుచుండును. ఈ బ్రహ్మాండ

కలదు. మనము జనసంఖ్య పెరిగినదని మనుకొనుచున్నాము గత అర్థశతాబ్దినుండి రెట్టింపు పెరిగినది. ఇంతటి పెద్దదేశము లోనే పెరుపట్టకుండిన నొక్కనికే పదికోట్లమంది కొడుకులు పుట్టిన నెక్కడ నివసింపఁగలరు?”

సూతుఁడిట్లనెను:- “స్వామీ! ఈ విచారములన్నియును బంచభూతముల సంఘాతముచేతనే స్వతః సృష్టియైనదనువారును, సృష్టియందు చైతన్య మవసరములేదను వారును, పృథివిని, గంగాది పవిత్రనదులను జడములనువారును బలుకు పలుకులు. కాని పృథివిని మాతగా భావించువారలకును, చైతన్య దేవిగా భావించి ఆమెను నుపాసించు వారలకును స్థానము నకుఁ గొదువయుండదు. వారికి పృథివి యెంతపెద్దది కావల యుననిన నంతపెద్దదగును ఎంతచిన్నది కావలయుననిన నంత చిన్నదగును. ఎవరికెట్టి భావనముండునో అట్టిఫలమే లభించును కంటికెదురుగు టద్దములను పెట్టుకొనిన వస్తువులన్నియును నట్లే కనఁబడును. రాత్రింబవళ్లు ఎన్నియెకరముల నేలయున్నది? దీనిలో నెంత పంటపండును? ఎందఱు నివసింపఁగలరు? అని లెక్కలు వేసికొనువారల కట్టిఫలమే లభించును. యోగప్రభావముచే శరీరపించువు పృథివి నెంతపెద్దది కావలయుననిన నంత పెద్దదిగ నొనర్పఁగలఁడు, ఎంతగా సంకోచమొనర్ప వలయు ననిన నంత చిన్నదగును.”

జను. పృథుశ్రవుని పుత్రుఁడు ధర్ముఁడు. ధర్ముని పుత్రుఁడు శనుఁడు, ఆతఁడు నూఱు అశ్వమేధయాగముల నొనర్చెను. ఉశనుని పుత్రుఁడు రుచకుఁడు. రుచకునకుఁ బురుజిత్తుఁడు, రుక్మ్ముఁడు, రుక్మేషుఁడు. పృథువు, జ్యామఘుఁడను నైదుగురు పుత్రులు జనియించిరి. వీరిలో చిన్నవాఁడగు జ్యామఘుఁడు తన భార్యకు పరతంత్రుఁడు"

శౌనకుఁడిట్లనెను:- "సూతా! పరతంత్రుఁడనగనేమి?"

సూతుఁడు నవ్వి యిట్లనెను:- "స్వామీ! నేనిదివఱకే చెప్పియున్నాను. మీరు మఱచియుండ వచ్చును. గారడివాఁడొక పిల్లవానినుంచుకొనును, వానిని దన కిష్టమువచ్చినట్లు తనకు వశమొనర్చుకొని, తన కిష్టమువచ్చినట్లు పలికించుచు, ఆదేశధముగ నాతఁడు తన భార్యకు వశుఁడై యుండెను. భార్య లెమ్మనిన లేచును; కూర్చుండు మనినఁ గూర్చుండును సారాంశమేమనిన నాతఁడు తన భార్య చెప్పినట్లాడుచుండును ఇప్పుడు వాని చరిత్రము వినుఁడు."



# శైబ్యాపతి జ్యామఘుడు

(౬౦౫)

శ్లో॥ పురుజిత్పుత్రకః రుక్మేషు పృథుః జ్యామఘ సంజ్ఞితాః।
జ్యామఘస్త్వప్రజోఽప్యన్యాం భార్యాం శైబ్యాపతిర్భయాత్।

శ్రీభాగ. ౯ స్కం. ౨౩ అ. ౬౫ శ్లో॥

వ.....ఆ రుచకునకుఁ బురుజిత్తు రుక్మాంగుఁడు రుక్మేషువు బృథువు జ్యామఘుఁడు ననువారేవురు పుట్టిరందు జ్యామఘుండు.

సీ॥ తొల్లి కొల్చెడు శైబ్య తోడి ప్రేమంబున
ననపత్యుఁడయ్యును నన్యభార్యఁ
గైకొనఁ డొక్క కొంతకాలమునకు

................

శ్రీమదాంధ్ర భాగవతము.

భార్యా భర్తలే గృహస్థ రూపమగు రథమునకు రెండు నొగలు. ఇద్దరును వారివారి స్థానములలో మంచిస్థితిలో నుండినచో గృహస్థాశ్రమమను రథము గబగబ చక్కఁగ దొర్లిపోవును; కాని యిద్దరును వారివారి కర్తవ్యములను మఱచి విపరీతాచరణము చేయుచుండినచో నప్పుడు రథమాగిపోవును. ఒకవేళ

నడిపినచో నత్యంత కష్టముతో నడచును. పత్ని యింటిలో యజమానురాలు భర్త బయటను భార్యయొక్క కార్యక్షేత్రము చిన్నదే కాని చాల మహత్త్వ పూర్ణమైనది భర్తయొక్క క్షేత్రము విస్తృతమైనది; కాని దానిలో రాగ, ద్వేష, ఈర్ష్యా, ప్రతిస్పర్ధ, చింతాదులు కలవు స్త్రీ గృహమునకు యజమానురాలు. కావుననే ఆమెను గృహిణియను పేరు వచ్చినది. పురుషుని బతనమునుండి రక్షించును గావునఁ బత్నియనఁ బరగినది. పురుషునకు సమస్త కార్యములందు దోడ్పడుటచే నర్ధాంగి యనఁబరగుచున్నది. పత్నిని, ఆమెకు పుట్టినవారినిఁ బురుషుఁడు పాలించును గావున నాతనికిఁ బతి యను పేరువచ్చినది. భరణపోషణ మొనర్చుటచే భర్తయనఁ బరగును. సత్పత్ని ప్రేమపూర్వక వ్యవహార మొనర్చి పతినిఁ దనవశము గావించుకొనును. పతి పత్నియొక్క ప్రేమపాశమున బాధింపఁబడి ఆమెకు విరుద్ధముగ నాచరణమును గావింపఁడు. ప్రేమబంధనమందు మిక్కిలి సుఖము కలదు ప్రేమలేక గర్వమునవలంబించి పతిని శాసించుచు, నాతనినిఁ దనకుఁ గ్రీడామృగముగఁ జేసికొని, తన యిష్టమువచ్చినట్లాడించుచుండు నడచును, పురుషుఁడును నట్టి నపుంసకుఁడై, స్త్రీ ముందట పిల్లివలెనై. తన పురుషత్వాభిమానమును బోనాడినచో నట్టి వానిదరికను జ్ఞానము కలుగును. ఇట్టిపురుషుని పేరు స్త్రీజిత్ స్త్రీకి వశపడిన పురుషుఁడు జ్ఞానాధికారి కాఁడని శాస్త్రములు

చెప్పఁబడియున్నవి. ఇట్టిపురుషునితో సంభాషణము చేయుటయును నుచితముకాదు. ఇఁకనిట్టి స్త్రీవిషయముఁ జెప్పవలసిన దేమున్నది? ఆమె తనయిహపరలోకములను రెంటిని పాడుగొట్టుకొనునది. ఏ స్త్రీయొక్క పతి ప్రేమ వలనఁగాక భయముచే స్త్రీని గాంచి గడగడవణఁకుచుండినను, ఏ స్త్రీ పరాధీనుఁడు, దాసులకువలె నుచ్చాసనము మీఁదఁ గూర్చుండి ఉచితానుచితములెఱుఁగక ఆజ్ఞలొసఁగుచుండునో, ఆమెయుఁ దరచుగా సంతానహీనయగును, ఒకవేళ సంతానముకలిగినను ఆడుపిల్లలు పుట్టుదురు, ఒకవేళపుత్రులు జనించినను, వారు పిచ్చివారుగనో మూర్ఖులుగనో, వ్యభిచారులుగనో, నపుంసకులుగనో అగుదురు. సారాంశమేమనఁగా స్త్రీజితుఁడగువాఁడు సంతానసుఖమును బడయఁజాలఁడు, అతని జీవనము సదాభయగ్రస్తమై యుండును, ఇట్టి స్త్రీజితులీలోకమునందును దుఃఖితులగుదురు, చచ్చిన నరకమునకుఁబోవుదురు.

సూతుఁడిట్లనెను:- మునులారా! ఇప్పుడునేను రుచక మహారాజుయొక్క చిన్నకుమారుఁడగు జ్యామఘుని చరిత్రము చెప్పెదను. అతఁడు భార్యకుదాసుఁడు. జ్యామఘుని భార్యపేరు శైబ్య ఆమె అతిగయ్యాళి. ఆమెపతిని లెక్కచేయనేచేయదు. ఆమె దాసదాసీజనముల నెట్లుచూచునో రాజునుకూడ నట్లేచూచును. రాజునిలుచుండిన నామె పీఠముమీఁ

ప్రక్కనుండి ఆజ్ఞలనొసంగుచుండును. ఓసయ్యా! నీవీపని చేయలేదేమని యడుగును."

రాజు పట్టి అసమర్థుడు. ఆతఁడు భయపడుచునిట్లనును:—
"మహారాణిగారూ! అపరాధమైనది."

ఆమె యింకను రోషమును ప్రకటించుచు నిట్లనెను:—
"ఇంకేమున్నది. నీవిరెండుశబ్దములను నేర్చుకొనినావు, ఎప్పుడును అపరాధమైనది, అపరాధమైనది?" అనుటయే అపరాధమెందులకైనది? నీవు కడుపునకన్నము తినుటలేదా? నేనే పనిని చెప్పినదానిని జేయక తప్పించుకొనుటయేనా? ఫలాని మంత్రిని తొలఁగించివేయుము. ఫలానివానిని నాకడనుంచుము'

భయముచే రాజునకు ధోవతి పాడైపోవుచుండును. ఆమె చేసి చెప్పినదానిని అవును కాదు అనక చేయవలసినదే. ఇట్టి స్త్రీవలన సంతానమెట్లు కలుగును, అందువలన నామెకు సంతానమేమియును లేకుండెను. తనరాణికొక కొడుకైనఁగలిగినఁజాలునని రాజనుకొనుచుండెను. ఆతఁడు తనకోరిక నెఱవేరుటకై యెన్నో జపములు, తపములు, యజ్ఞానుష్ఠానములను జేయించెను సంతానాపేక్షచేఁబితృగణమును, విశ్వేదేవతలను నారాధించెను. కాని అన్నియును వ్యర్థమయ్యెను. ఇసుకలో నుండి తైలమును దీయుటెట్లు వీలులేదో వంధ్యాస్త్రీకి సంతానము కలుగుటయును సంభవముకాదు. రెండవ వివాహమును

మహాత్ముఁడిట్లనెను.- "అట్లు కాదయ్యా అట్లనకుము. మనకు శక్తి భక్తి త్యాగులగు మహాత్ములవలననే లభించును. వారు త్యాగముయొక్క ఆదర్శమును జూపించెదరు."

మరల నాభక్తుఁడా విరక్తుఁడగు మహాత్ముని కడకు పోయి యిట్లనెను:- "స్వామీ! మీరారూపాయలను తుచ్ఛముగ భావించి కాలఁదన్నితిరి; కాని యామహాత్ముఁడు వెళ్ళఁగానే వాటినిఁదీసికొనెను. ఆమహాత్ముని విషయము నాకు తెలియుటలేదు."

విని మహాత్ముఁడు నవ్వి యిట్లనెను:- "నాయనా! నీవు వానిని నిందింపవలదు. మేము సర్పమువలె నోటఁబరిగ సం[illegible] బిందువుగా దాటి పోయెదము. ఆమహాత్ములు తరణ తారకులు. వారు స్వయముగఁ దరించెదరు. అసంఖ్యాకులను తరింపఁజేయుటకు భగవానుఁడు వారినాకార్యములకే పంపించుచున్నాఁడు. వారు మాకంటెను శ్రేష్ఠులు"

ఈ ప్రసంగమును జెప్పుటయొక్క యుద్దేశ్యమేమనఁగా ఈయపార సంసారమును స్వయముగ సాధనముల ద్వారా తరించినవాఁడు సర్వశ్రేష్ఠపురుషుఁడే, ఆతఁడు మానవ జీవనమును సార్థకముచేసి కొనినవాఁడే. కాని చాలమందిని వెంటఁ బెట్టుకొని సంసారమును దాటువాఁడంతకంటెను శ్రేష్ఠుఁడు.

నిమ్లోచి, కింకణ, ధృష్టి, శతాజిత్, సహస్రజిత్, అయుతాజిత్తను వారలు.

సాత్వతసుతుఁడు దేవావృధుఁడు తరణ కారణుఁడు. ఈతని పుత్రుఁడు బభ్రుఁడును దండ్రివలె మహాయోగి, పరమ జ్ఞాని, ఆచార్య కోటిలోనివాఁడు, ఈపితాపుత్రుల విషయములో నొక పౌరాణిక సూక్తి ప్రసిద్ధముగఁగలదు చాలమంది చెప్పుట గొప్పగాఁ జెప్పుటయే కాని చేయునదేమియునుండదు పర్వతములు దూరమునకు నునుపుగనుండును. దగ్గఱకుఁబోయిన రాళ్ళు, గుండ్లు. దూరమునుండి హోరుమోత వినిన నదియెంతో గంభీరముగ నుండును; కాని దగ్గఱకుఁ బోయి దాని లోపలిస్థితిఁగాంచిన నది డొల్లయని తేలిపోవును. అదే విధముగఁ జాలమంది విషయము దూరమునుండి వారి ప్రశంసలను వినిన నెంతోయుండును, కాని దగ్గఱకుఁబోయి చూచిన వారి నిజస్థితి అంత ఉన్నతముగ గోచరింపదు. చాలమంది కృతులను గాంచి వారెంతో ఉచ్చకోటికి సంబంధించిన మహాపురుషులనుకొందుము. వారి దగ్గఱకుబోయి చూచినచో వారు వ్రాసినది వారి జీవితమునఁ బరిణమింపఁ జేసికొనలేక పోయిరని తేలగలదు. అట్టివానిని నిర్జీవయంత్రముగ భావింప వలయును. కొందఱు చెప్పినదేమో చేసితీరెదరు. వారికి లోపల నెంతో బయటకునంతే. వారినిఁగూర్చి దూరమునవినిన నంతో దగ్గఱకుఁ బోయిన నంతే. వారే మహాపురుషులు; వారే పూజ

ఉగ్రసేనుని వివాహము విదర్భదేశాధీశుఁడగు సత్యకేతుని పుత్రియగు పద్మావతితో నయ్యెను. ఆమెగర్భమునుండి కంస, కంసవతి కంక, శూరభూ, రాష్ట్రపాలికయను పుత్రికలుదయించిరి, పిదపవారలను వసుదేవుని తమ్ములను బెండ్లాడిరి.

శౌనకుఁడిట్లనెను:- "సూతా! ఉగ్రసేనునకు బుత్రులుండిరా?

నవ్వి సూతుఁడిట్లనెను:- "స్వామీ! మీకంతయును దెలియును. ఇంత అమాయకముగఁ బ్రశ్నించెదరే యెఱుఁగనివారివలే.

ఈఉగ్రసేనునకే కాలనేమి యను నసురుఁడు కంసరూపమున నుదయించినాఁడు. ఈతఁడు యాదవులతో వైరమును బెట్టుకొనినాఁడు. ఈతని నిమిత్తముగఁ జేసికొనియే భగవానుఁడవతరించినాఁడు. ఈదుష్టుఁడు యదువంశీయులను మిక్కిలిగ బాధించినాఁడు. ఇట్టి క్రూరఅసురపుత్రుని కారణమున మహారాజు మిక్కిలి దుఃఖితుఁడై యుండెడివాఁడు తాను కాలనేమియను నసురుఁడని కంసునకుఁ దెలియును, పూర్వజన్మమును విష్ణువు తన్నుఁజంపెననియును దెలియును. అందువలననాతఁడు యదువంశీయులను తన తండ్రియగునుగ్రసేనుని ద్వేషించుచుండెను ఆతఁడెంతవఱకు బీడించుచుండెను. ఈతఁడు కాక ఉగ్రసేనునకు సునాముఁడు న్యగ్రోధుఁడు, కంకుఁడు.

శంకుఁడు, సుహూ, రాష్ట్రపాలుఁడు, సృష్టి, తుష్టిమానుఁడను నెనిమిదిమంది పుత్రులు కలరు ”

అంత శౌనకుఁడిట్లడిగెను:- “సూతా! ఉగ్రసేనుఁడు మిక్కిలి ధర్మాత్ముఁడే అట్టివానికిట్టి తనవారిని బాధించు క్రూర స్వభావముగల అసురుఁడేల యుద్భవించినాఁడు ”

ఇదివిని సూతుఁడిట్లనెను:- “స్వామీ! ఇదంతయును మాతృదోషముచే నిట్లైనది సంతానమునకు తల్లిదండ్రుల యొక్క స్వభావమును, సదాచారమును కారణమగును. పతికిదూరముగనుండి స్త్రీలు స్వచ్ఛందముగనుండుట మిక్కిలి అనర్థహేతువు. పరమార్థహీనులగు పాశ్చాత్యజాతి యీ రహస్యము నెఱుఁగఁజాలరు. వారికి శారీరకసుఖమే సమస్తమునై యున్నది. కాని అధ్యాత్మవాదులైన వారలు రజోవీర్యముల విశుద్ధతయందెక్కుడు దృష్టియుంచవలయును. పతి దూరముగ నుండిన యువతులగు స్త్రీలకు చాంచల్యము వృద్ధియగును. ఉగ్రసేనుఁడటువంటి ధర్మాత్మునకిట్టి క్రూరకర్ముఁడగు పుత్రుఁడుదయించుటకు కారణమయ్యెను. ఈవిషయమునకొక పౌరాణికగాథకలదు. దానిని మీకు జెప్పి తరువాత మిగిలిన కథను జెప్పెదను.”

# కాలనేమి కంసుఁ డెట్లయ్యెను?

(౨౦౮)

శ్లో॥ ఆత్మానామిహ సంజాతం జానన్ప్రాగ్విష్ణునా హతమ్।
మహాసురం కాలనేమిం యదుభిః స వ్యరుధ్యత॥

శ్రీభాగ. ౧౦ స్కం., ౧ అ. ౬౮ శ్లో॥

క॥ నారదుమాటలు విని పెం
పారాటముఁ బొంది యదువు లనిమిషులనియున్
నారాయణ కర ఖడ్గ వి
దారితుఁడగు కాలనేమి దాననియు మదిన్॥

శ్రీమదాంధ్రభాగవతము

ప్రాణులకు విషయములందు సహజానురాగము కలదు. ఈ జీవజగత్తునకు జనకుఁడగు వాఁడొక్కఁడే స్వతంత్రుఁడు. అందువలన నందఱును స్వభావమున స్వతంత్రులు కాఁగోరు చుందురు. పరతంత్రతవలన దుఃఖమును, స్వతంత్రతయందంద ఱకును సుఖానుభవమును గలుగును; కాని ఒకానొక బంధ ములో నున్నవాఁడే స్వతంత్రానుభవమును బొందఁగలఁడు. బంధనానుభవమును బొందనివాఁడు విముక్తి సుఖము నెట్లను భవింపఁగలఁడు. కావున ధర్మ బంధమును, ప్రేమబంధనమును సుఖమునకుఁ బరమహేతువులగును. ధర్మబంధనములో బంధిం

పంబడనివారు పరమాత్మ నెట్లు పట్టుకొనఁగలరు. ప్రేమ బంధనమున బంధింపఁబడి, తన తను, మన, ధనాది సమస్త శారీరక మానసిక చేష్టలను, తన సర్వస్వమును తన ప్రేమాస్పదున కర్పింపకుండిన వారు ప్రేమ రహస్యము నేమి యెఱుఁగినట్లు? పతివ్రతయగు పత్ని తన సర్వస్వమును పతిచరణముల కర్పించి అఖిలసృష్టికిని స్వామియగు నట్టి పతివ్రతకు విరుద్ధాచరణమును జేయఁగలవారెవరు? తన పతిని తన సర్వస్వమనుకొనక శారీరక సుఖములందే పడియుండుదానినే పరపురుషులు తలయెత్తి చూడఁగలరు. దానినే బలాత్కారముగాని, మోహముచేయుటగాని జరుగును.

సూతుఁడిట్లనెను:- "మునులారా! ధర్మాత్ముఁడగు నుగ్రసేనమహారాజునకు దుష్టాత్ముఁడును, నసురపుంగవుఁడు నగు కంసుఁడెట్లుద్భవించెను సంగతిని మీకు చెప్పెదను. ఈ ప్రసంగము వలనఁగాలనేమి యెట్లుగ్రసేనునకుఁ బుత్రరూపమున నుదయించెనో తెలియఁగలరు."

మాధుర మండలమునకు రాజగు ఆహుకుని కుమారుఁడు ఉగ్రసేనుఁడు ధర్మపూర్వకముగఁ బ్రజాపాలన మొనర్చుచుండెను ఆతఁడు సకల ధర్మవేత్త, శూరవీరుఁడు, దాత, సమస్త సద్గుణసాగరుఁడు. ఆతని వివాహము విదర్భాధీశుఁడగు సత్యకేతుని పుత్రిక పద్మావతితో నయ్యెను. పద్మావతి పేరు

సకలసద్గుణ గుణవతి ఆమె పద్మావతియనునది. మహారాజట్టి సుందరియును సర్వగుణ సంపన్నయునగు భార్య బొంది పరమ ప్రముదితుఁడయ్యెను. భార్యాభర్తలిద్దరకును గొప్ప ప్రేమ కలదు.

పద్మావతి తన తండ్రికేకైకపుత్రిక. అందువలనఁ దల్లి తండ్రులకు ఆమె మీఁద నత్యధికానురాగము కలదు. అందు వలనఁ గొలఁది దినములు గడువఁగానే తల్లిదండ్రులు తమ పుత్రికనింటికిఁ బిలిపించుకొనవారు. ఒకసారి పుత్రిక అత్త వారింటికిఁబోయి చాలకాలము గడిచెను. విదర్భరాజాధీశ్వరి తనపతితో నిట్లనెను:— “ప్రాణనాథా! నేను పద్మావతిని జూచి చాలదినములైనది. ఆమె నాకు మాటిమాటికి జ్ఞాపకమునకు వచ్చుచున్నది. ఆమెను శీఘ్రముగ మీరు కొన్నాళ్లుండు నట్లు పిలిపించవలెను.”

ఇదివిని సత్యకేతునిట్లనెను:— “ప్రియా! నాకును పద్మావతి చాలగజ్ఞాపకమునకు వచ్చుచున్నది, నేను నేఁడే మథురకు దూతను బంపెదను, ఉగ్రసేన మహారాజు నేను చెప్పిన నవశ్యము పంపఁగలఁడు.”

ఇట్లని మహారాజు వెంటనే దూతలను, దనకుల పురోహితునిఁ బద్మావతినిఁ దెచ్చుటకు మథురకుఁబంపెను. కుల పురోహితుఁడుపోయి అందఱకుశలము నడిగి రాజు సందేశము

చేసెనది. తండ్రియింటికి వచ్చినతరువాత భర్తకు దూరముగ నుండి స్త్రీలీవిధముగ నలంకరించుకొని శృంగారముగ నుండఁ గూడదనియు, ఇంత స్వచ్ఛందముగఁ గ్రీడించుటయును, హాస వినోదములలో నర్పరాదను సంగతిని మఱచిపోయెను. ఆమె తన తండ్రికి గారాబు పుత్రిక. ఇంటికి వచ్చినతరువాత నామె అతి చపల చంచల బాలికవలెనయ్యెను. తన సఖులతో వనోపవన ములకును, సరితా సరోవరములకునుబోయి క్రీడించు చుండె డిది. ఆడుచుఁ బాడుచు వనవిహారానందమును జూరఁగొను చుండెను.

ఒక దినమున నామె బాగుగా నలంకరించుకొని, షోడ శశృంగారము లొనర్చుకొని సఖులతో నొక సుందరసరోవర నికటమునకు గ్రీడానిమిత్తమై పోయెను. ఆమె తన సఖులమధ్య మెఱుఁగు తీఁగవలె వెలుఁగుచుండెను. వసంతఋతువు వనశ్రీ యును నేఁడు సముచిత శృంగారమును గావించుకొనెను. ఆమె క్రీడింపఁబోయిన సరోవరమునకు సర్వతోభద్రమని పేరు. దాని సమీపముననే దట్టమైన సరఁటితోటకలదు. అది దట్ట మైన లతావితానములచే సుశోభితమై యుండెను ఒకవైపునఁ బచ్చనైన చిన్నకొండకలదు. రెండవవైపు అతి సుందరమనో హారమగు వనస్థలికలదు వివిధరంగులుగల పుష్పములచ్చట విచ్చుచు నానందమున నూగుచుండెను. సఘన ద్రుమముల యొక్క శాఖలూగుచు భూమిని ముద్దిడుకొనుచుండెను. ఈ

వనశోభను గాంచి సుకుమారీమణులందఱును నానందించిరి. ఆటవ ల్లో కేళియాడువారు. ఆచ్చట నెవరును పురుషులు లేరు. ఎవ్వరి కిని సంకోచము లేదు. ఏకాంతస్థానమును బొంది అందఱు హృద యములందు సరసతా సంచారము కాసాగెను. సాధారణముగ స్త్రీలు స్వభావముచే చంచలులుగ నుందురు. అందులో యువావస్థ. అందఱకును చిన్నవయస్సే. అందువలన నిస్సంక్రీ హాసములనే యొనర్చుచుండిరి. అటునిటుగల విప్పపూల గోసి చీకి వానిలోని రసపానము నొనర్చుచుండెను. కొందఱు గాన ముచేయుచుండిరి కొందఱు నృత్యమును జూపుచుండిరి. కొం దఱు వాద్యముల నొనర్చుచుండిరి. ఈవిధముగ వారు క్రీడలొ నర్చుచు నలసిపోయిరి. ముఖకమలములనుండి స్వేద బిందువు లును రాలుచుండెను. పద్మావతి యిట్లనెను:- "ఇప్పుడు జల విహారం మొనర్చెదము." ఇంకేమున్నది! అందఱును దమ తమ వస్త్రములనూడ్చి సరోవరమున దుమికిరి. ఒకతె యింకొక తెను ముంచును. వేఱొకతె నీటిని జిమ్మును. ఇంకొకతె యింకొకయామెను భుజములపై నెక్కించుకొని జలములందుం ద్రోయును. దీనిని గాంచి అందఱును నవ్వుచు నవ్వుచు బొర లాడుచుండిరి. ఒకతె యింకొకయామె భుజముపై నెక్కెను. మఱియొకతె యిద్దరను బడద్రోయును. ఈవిధముగ వారా నంద వినోదములను. హాస్యతరంగములం దేలియాడుచుండిరి.

ఆసమయమున నచ్చటికి దైవయోగమున లోకపాలుం డగు కుబేరుని సేవకుండగు గోభిలుండను దైత్యుండచ్చటకు వచ్చెను. ఆయువతులు జలక్రీడలో నిమగ్నులగుటను గాంచి కరబద్ధముగ నిలుచుండెను. అతని దృష్టి పద్మావతి మీఁదఁ బడెను. ఆమె రూప, యౌవన, సౌందర్య, లావణ్యములను గాంచి దైత్యుండు కామాతురుండయ్యెను. అతండిట్లనుకొనెను: “ఈసుందరి యెట్లు లభింపఁగలదు?” గోభిలుండు శక్తిమంతుఁడు. అతండు ధ్యానమున నీమె విదర్భరాజ కుమార్తె యనియు, మధురానరేశుండగు నుగ్రసేనుని భార్యయనియుఁ దెలిసికొనెను కాని యీమె తన పతినిఁదప్ప పరపురుషునిఁ గోరదు. ఈమెతో నేను సంగమించుటెట్లు? ఈవిషయమును గూర్చి అతండు నిలుచుండి ఆలోచించుకొను చుండెను. వెంటనే ఆతని మనస్సునకొక విషయము తట్టెను:- “నేను మాయచే నుగ్రసేనుని రూపము నేల ధరింపఁగూడదు?”

ఈయాలోచనము రాఁగానే ఆతనికి మిక్కిలి ఆనందము కలిగెను, ఆతండు వెంటనే ఉగ్రసేనుని రూపము ఉన్నదున్నట్లుగ ధరించెను. ఈతండు తన దానవమాయచే నీతండు మధురేశుండగు నుగ్రసేనుండు కాదని అనుమానింపకుండునట్లు రూపమును ధరించెను. ఇట్టి సుందర రూపము ధరించి ఆతండా సరోవర సమీపమున నొక సుందర ఘన అశోక

వృక్షముక్రిందఁ గూర్చుండి స్వరసహితముగ వేణువు నూదు చుండెను. పక్షులును మాఱుమ్రోగునట్లు కర్ణప్రియమగు సంగీతమును వినరెను. ఆసైత్యఁకు సుందర సులలిత కంఠ ధ్వనితోఁ దాళ, లయ, స్వరాది సహితముగఁ బాడుచు వేణు వునూదుచుండెను. సఖుల మధ్యను గూర్చుండిన పద్మావతి చిత్తమును హఠాత్తుగఁ దనవైపునకు నాకర్షించు సంగీతము వినెను. అప్పుటనే కూర్చుండి తన చెలికత్తెలతో నా సంగీత మును గూర్చి ప్రశంసించుచుండెను. సంగీత తరంగములువచ్చి ఆమె హృదయమును నుత్తేజితమొనర్చుచుండెను. ఇప్పుడామె తన స్థానమునఁ గూర్చుండఁజాలకపోయెను. కుతూహల వశమున సంగీత స్వర సహాయమునఁ దన సఖులతో నా దిక్కునకుఁ బోయెను. అశోకవృక్షముక్రింద నొకవ్యక్తి కూర్చుండి వేణువు నూదుచున్నాఁడనియు నదే స్వరమున గీతమును బాడుచున్నాఁ డనియుఁ దెలిసికొనెను. కొంచెము సమీపమునకుఁ బోఁగానే ఆమె యాశ్చర్యమునకు మేరలేకుండెను ఈతఁడు నా ప్రాణ నాథుఁడగు మధురాధీశ్వరుఁడే కాని ఆమె మాటిమాటి కిట్లు తలంచుచుండెను:— "ఆతఁడు వచ్చు సూచనయేమియుఁ జేయ లేదే అంతఃపురమునుండి యాతండిట్లు వెంటనే యెట్లు రాఁగ లఁడు? ఈతఁడింకొకఁడేమో! నాకు భ్రమకలిగినదా యేమి?" ఈవిధముగ సంశయములోఁబడి పద్మావతి యిదంతయును నాలోచించునంతలో నా మనుష్యుఁడగు శోభిలుఁడిట్లు పలికెను:—

"ప్రియా! నీవు నాకడకురమ్ము. నేను నీవులేక వ్యాకులతను జెందుచున్నాను."

ఇప్పుడు పద్మావతి కేమియును సందేహము లేకుండెను. ఆమె పరువిడి ఉగ్రసేన రూపమునున్న నాదైత్యుని సమీపమునకుఁబోయి, ప్రణామ మొనరించి యిట్లడిగెను:- "ప్రాణనాథా! మీరెప్పుడు వచ్చితిరి?"

మాయావియగు దైత్యుఁడిట్లనెను:- "ప్రియా! నాకు నీవులేకుండిన క్షణమొక యుగముగనున్నది. నేను నీవిరహమును నధికముగ సహింపఁజాలకపోయితిని. అందువలన నారాజ్యమును వదలి నీసమీపమునకు వచ్చితిని. దేవీ! నీవులేకున్న నాజీవనమసంభవము. నీవిరహమున నాకు వ్యాకులముగ నున్నది. అనంగుఁడు తన కుసుమ శరీరములతో నన్ను జర్ఝరునిఁ గావించినాఁడు."

పద్మావతి సఖులాతఁడుగ్రసేనుఁడని గ్రహించి అచ్చటి నుండి తొలగిపోయిరి. ఆదుష్టుఁడు నానాప్రకారములగు సరసములును, స్నేహాభరితములునగు వాక్యములను బలికి రాజకుమారిని దట్టమైన వనములో నొకయేకాంత ప్రదేశమునకుఁ గొనిపోయి తనకోరికను నెఱవేర్చుకొనెను. ఉగ్రసేనునకు విశిష్టాంగమున విశిష్టచిహ్నము కలదు ఆయంగముననాచిహ్నము లేకపోఁగాఁ బద్మావతికి వానిపైసందేహము కలిగెను. ఆమె

దైత్యుఁడిట్లనెను:- "బాగుగా నెఱుఁగుదును. పతివ్రత అసంభవమును సంభవము కావింపఁగలదు. సూర్యచంద్రుల గతినడ్డగింపఁగలదు సుమేరువును భస్మము కావింపఁగలదు. సప్తసముద్రములను సంకల్పమాత్రము నిండింపఁగలదు. శరీరము సంగతి సట్లుంచుఁడు; ఎవఁడునునామెను మనస్సుతోనైన దూషితను గావింపఁజాలఁడు."

పద్మావతి యిట్లనెను:- "నీకింత దెలిసియుండిన నింత సాహసకార్యము నేలఁజేసితివి?" నేను నిన్ను శపించి భస్మమొనర్పనా.

దైత్యుఁడిట్లనెను:- "ఏలఁ జేయఁజాలవు? నీవు నిజముగఁబతివ్రతవగుచో నవశ్యము చేయఁగలవు"

ఉపేతౌన్వరమున గోభిలుఁడిట్లనెను.- "నాకు సందేహము లేదు. నీవు పతివ్రతవుకావని పూర్ణ విశ్వాసమున్నది. అందువలన నాకు నీశాపభయమునులేదు. నీవు పతివ్రతవై యుండినచో నీవిధముగఁ బతిని వదలి యిచ్చట వనవిహారమొనర్పవు. పతివ్రత పతిలేక ఒక్కక్షణమైన నుండఁగలదా?"

పద్మావతి యిట్లనెను:- "ఓరినీచా! నేనెచ్చటికిని బయటకుఁబోలేదు నన్ను నాతండ్రి ప్రేమపూర్వకముగఁ బిలిచినాఁడు స్త్రీయుండుటకు రెండేస్థానములుకలవు-పతి గృహము,

పితాగ్రహము. నేను పతికి శారీరకముగ దూరముగ నుంటినిగాని మనస్సాతనిఁ జింతించుచునేయున్నది ”

గోపిలుఁడిట్లనెను:- ‘నీవు మనస్సుతో నీపతినిఁ జింతించుచుండిన నీవు నన్ను కన్గొనలేవేమి? ఇది యసంభవము. పతివ్రతాధర్మములు నీకు తెలియవు. నీవు ధైర్యముతో వినుము. కోపపడకుము. అట్లైన నేను నీకు పతివ్రతా ధర్మములను జెప్పెదను. ఆలక్షణములు నీలో నున్నచో నాకు నీవు శాపమొసంగ ధర్మమొసప్పము. అవి లేకున్నచో మెదలక నీయింటికి నీవు పొమ్ము.”

పద్మావతియిట్లనెను:- “మంచిది, పతివ్రతా ధర్మములను జెప్పుము.”

గోపిలుఁడిట్లనెను:- “దేవి! సావధానవై శ్రవణ మొనర్పుము ”

పతివ్రత- నిత్యమును మనోవాక్కాయ కర్మలచేఁ దన పతినే సేవించుచుండును.

పతివ్రత- పతిసంతోషమే తన సంతోషముగ నెంచును.

పతివ్రత- పతి కోపించినను దాను గోపింపదు.

పతివ్రత- పతి తిట్టినను బ్రత్యుత్తరమీయదు.

పతివ్రత- పతి పరిహార మొనర్చినను దిరిగివానిని రోష భరితదృష్టితోఁ జూడదు.

పతివ్రత- సదా తన పతియొక్క సుఖదుఃఖములందు వెంటనుండును. పతిని సుఖిగానుంచుటయే ఆమెకు జీవితలక్ష్యముగానుండును. పతి దోషములవైపు ఆమె ధ్యానముంచదు. గుణములవలననే ఆతని నాదరింపదు. పతి సురూపుఁడైనను, కురూపియైనను, సర్వాంగుఁడైనను, హీనాంగుఁడైనను, స్వస్థుఁడైన మహారోగ యుక్తుఁడైనను సమస్తవిధముల నామె ఆతని సేవ యొనర్చును.

పతివ్రత- పతిలేని సమయమున శృంగార మొనర్చుకొనదు గ్రామ్య సుఖముల ననుభవింపదు; హాస పరిహాసములు, వినోదములు, మనోరంజనము, చంచలత్వము నొనర్పదు.

పతివ్రతకు పవిత్రత, శుచిత్వము, అలంకారము, శృంగారము, హాస్య పరిహాసములు, శారీరక మానసిక చేష్టలన్నియును పతి ప్రసన్నతకొఱకే యుండును. ఈలక్షణములన్నియును నీలోఁగలవా? నీవుపతిని దేవతగా భావించుచున్నావా? నీవు కులటాస్త్రీవి కావా? కావలయుననినఁ గులటాలక్షణములను జూపి చెప్పెదను.''

ఇదివిని మండిపడి పద్మావతి యిట్లనెను:- "ఓసీ! దుష్ట దైత్యా! నీవధికముగా వాగుచున్నావు సిగ్గులేనిదానా! పతినే సర్వస్వముగ భావించు నన్నుఁ గులట యనుచున్నావా? నీవు నాలో నేమి కులటాలక్షణములను జూచితివి రా?"

ధైర్యముతోడను, కాని రోషస్వరమునఁ గోశీలుఁడిట్లనెను:- "పతి లేనపుడే స్త్రీ లోలుపత్వావశమున గామ్యసుభోగముల ననుభవించునో అదికులట. భర్తనువదలి అన్యపురుషుల మీఁద మనస్సును లగ్నమొనర్చునదో, అదికులట. మంచిది, రాణీ! నీవు పతివ్రతననే యనుకొనుచుండినను పతిలేని సమయమున నీవిన్నోటము భోగిస్తుచుంటివేల? ఈయువినీలాలకములగు కురులలో నీబహుమూల్యమగు సుగంధతైలమునేల నెవరి కొఱకు రాచుకొంటివి? ఈసుందరములగు వెండ్రుకల నెవరి కొఱకు గొప్పపెట్టి నలంకరించుకొంటివి. ఎవరిఘ్రాణేంద్రియమును దృప్తిపరచుటకై ధమ్మిల్లమునందు సుగంధయుక్తమగు నీమాలతీమాలను ముడుచుకొంటివి. అనేక సుగంధ పదార్థములతోఁ గూడుకొనిన సీతాంబూలమును నెవని ఘ్రాణమందు సుగంధితశ్వాసను గుప్పించుటకు సేవించితివి. వక్షస్థలమందు కేసర, కస్తూరి కర్పూరాదులతోఁ గూడుకొనిన సుగంధమును నేపురుషుని చేతులను సుగంధమొనర్చుటకై అలదుకొంటివి? హస్తములందగరు గంధమును, కాళ్లకు పారాణి యెవరిమనస్సు నాకర్షించుటకై పెట్టుకొంటివి? పతివ్రత యీనన్నిటినిఁ బతిని

ప్రసన్ననొనర్చుకొనుటకై చేయును. ఆమె స్వయముగఁ దనను క్షమఁగొనుటకై శరీరము నలంకరించుకొనదు. నీభర్త యిచ్చటికి నాల్గువందల క్రోసులదూరమున నున్నాఁడు నీవో యిచ్చట భోగవిలాస మొనర్చుచున్నావు. ఇదేనా నీపాతివ్రత్యము! దుష్టురాలా! నాకు శాపమొసంగుట యట్లుంచి ఒక్కపారి నీ పాపమును జూచుకొనుము, మానవులు తమ దోషములను జూచుకొనరు. ఇతరులమీఁద నెపము లెన్నుచుందురు. నీపతి మధురలోనున్నాఁడు. నీవో విదర్భదేశములో భోగవిలాస మొనర్చుచున్నావు. మదమత్తవై గంతులు వేయుచున్నావు. పైఁగా నేను పతివ్రతను బతివ్రతనని చెప్పుచున్నావు. నీవు బండవు. నేను నిన్ను వ్యభిచారిణి స్త్రీగా భావించుచున్నాను నీయందు తేజ, ఓజ, బల తప, శక్తి సామర్థ్యములును, పాతివ్రత్యప్రభావమున్నచో దానినినాకు జూపింపుము. ఇదిగో, నేను యెదుట నిలిచియున్నాను. నాకు నష్టము కావింపఁగలిగినఁ గావింపుము మేమునుషులము, మాకిట్టి స్త్రీలెచ్చట లభించిన నచ్చటికేఁబోయి, వారికిష్టమున్నను లేకున్నను, కపట మోసములచే, కళా కౌశలముచేతను, మాయాదులచేతను మోహింపఁజేసి, మాకోరికను నెఱవేర్చుకొని పోయెదము. నేనునీయుదరమున నమోఘవీర్యమును స్థాపించితిని. దీనిలోనికి గాలనేమియను రాక్షసుఁడు సంకల్పముచే వచ్చినాఁడు. అతఁడు నీకడుపునఁబుట్టి నీభర్తయొక్క వంశమువారిని బాధింపఁ గలఁడు" అని యిట్లుపలికిఆ దానవుఁడచ్చటినుండి వెడలిపోయెను.

పద్మావతికి తన పొరపాటు తెలిసెను. ఆమె శరీరమం తయును బాధచెందుచుండెను. నేత్రములనుండి అశ్రుధారలు ప్రవహించుచుండెను. లజ్జా, దుఃఖ ఆత్మగ్లాని, శోకకారణ మున నామె వెక్కి వెక్కి యేడ్చుచుండెను. ఆ మెసఖులు దూర ముగనుండిరి. రోదన శబ్దమును విని వారందఱును పరుగిడి వచ్చిరి. వచ్చి చూడఁగా పద్మావతి అత్యంత దుఃఖితయై ముఖమును గప్పుకొని ఉచ్చస్వరమున నేకాకియై రోదనము చేయుచుండెను.

వచ్చి అందఱును భయముతో నిట్లనిరి:— "రాజకుమారీ! మహారాజెప్పటికిఁ బోయినాఁడు? నీవింత దుఃఖితవై యుంటి వేల?"

ఏడ్చుచు రాజకుమారి యిట్లనెను:— "అక్కలారా! నాప్రాణనాథుఁడగు మహారాజిచ్చటకు రాలేదు. ఆతఁడెవఁడో దుష్ట దానవుఁడు. అతఁడు ఛద్మవేషమును ధరించి నాసతీత్వమును జెఱిపినాఁడు! ఇప్పుడు నేనేమి చేయుదును? ఎచ్చటికిఁ బోదు? నేను తెప్పగా మోసగింపఁబడితిని. ఎచ్చటను నుండక పోయితిని. నేను లోకమునకు ముఖము నెట్లు చూపఁగలను? నాపాపము నెట్లు దాపఁగలను? అయ్యో! నేనేజన్మములోఁ జేసినపాపముదయ మైనది? ఇప్పుడు నేను నా తల్లిదండ్రుల కడకుబోను నేనిచ్చనే ఆత్మహత్యను గావించుకొని మరణించెదను." ఈవిధముగ రోదన మొనర్చుచు విలపించెను.

సఖులామెను వివిధవిధముల నోదార్చిరి. కర్మభోగము లనుగూర్చి చెప్పి. పదోవిధముగ ధైర్యమును జెప్పి విదర్భాభీ శుని భవనమునకుఁ గొనిపోయిరి. అచ్చటికిపోయి పద్మావతి తన తల్లికీసమాచారమునంతను జెప్పెను తల్లి తన పతియగు సత్యకేతునకీ సమాచారమునంతను జెప్పెను. మహారాజునకుఁ గూడ మిక్కిలి చింతకలిగెను. తన మానమర్యాదలను, కుల కీర్తిని నిలుపుకొనుటకై రాజు వెంటనే పురోహితుని, సేవ కులనిచ్చి పద్మావతినిఁ దనభర్తయింటికిఁ బంపివైచెను.

ఉగ్రసేన మహారాజు తన ప్రాణ ప్రియాగమనమునకుఁ బరమ ప్రసన్నుఁడై అత్తగారింటి కుశలము నడిగెను. రాణి ఆవిషయము ను భర్తకడఁజెప్పలేదు. ఆమె ఆగర్భమును దీసి వేసికొనుటకనేక ప్రయత్నములొనర్చెను. కాని, అదిపోయెడు గర్భముకాదు. అనుకొఁడామెఉదరమునఁ బ్రవేశించియుండెను. రాణి గర్భమునుధరించి సంవత్సరమైనది; కాని ప్రసవచిహ్నము లేవియును గనఁబడలేదు. ఈవిధముగఁ బదిమాసములకుబదులు పదిసంవత్సరములయ్యెను. ఆదుష్టుఁడు బయటకురాలేదు. చివ రకు పదవసంవత్సరములో నాకాలనేమి దైత్యుఁడు పద్మా వతిగర్భమునుండి యుత్పన్నమయ్యెను. మహారాజు చాలవైభ వముగ నాతనికి జన్మోత్సవము గావించెను. ఆతనికి కంసుఁ డను పేరు పెట్టఁబడెను. కంసుఁడేయేకార్యము లొనర్చినది ఆ వర్ణనము శ్రీకృష్ణచరిత్రమునందు రాఁగలదు.

సూతుండిట్లనెను:- "మునులారా! నేను వృష్ణివంశపు రాజులచరిత్రమును సంక్షేపముగ వర్ణించితిని. అనమిత్రుని పుత్రుండగు వృష్ణికి శ్వఫల్కుఁడు, చిత్రరథుఁడును నను పుత్రులుండిరని నేనిదివరకే చెప్పియుంటిని. శ్వఫల్కునకు అక్రూరాదులు పదముగ్గురు పుత్రులని నేనిదివరకే చెప్పియుంటిని. వారి పేర్లను కూడ నేనిదివరకే చెప్పియుంటిని. ఇప్పుడిక చిత్రరథుని వంశమును గూర్చి వినుఁడు. చిత్రరథుని పుత్రుఁడు విదూరథుఁడు. విదూరథుని పుత్రుఁడే శూరుఁడు. ఈశూరుని కారణముననే కృష్ణభగవానునికి శౌరియను పేరువచ్చినది. ఈవంశముననే వసుదేవుఁడు జన్మించినాఁడు. కావున నిప్పుడు శౌరి వంశవర్ణనమును గావించెదను."



# నారకసంకమందు వసుదేవుఁడు.



శ్లో॥ దుందుభయో నేదు రానకా యస్య జన్మని।
వసుదేవం హరేః స్థానం వదన్త్యానక దుందుభిమ్।

శ్రీభాగ ౯ స్కం. ౨౪ అ. ౨౯ శ్లో॥

ఉ. శ్రీ మహాత్ముఁడైన వసుదేవుఁడు పుట్టిన వెంట నింటిపై
నానక దుందుభుల్ మొరసె నచ్యుతుఁ డీతనికిం దనూజుఁడై
వాఁ డగుఁ బుట్టునంచు గరిమంబున దేవత లుబ్బ రాజవం
శాన తన్నిమిత్తమున నానకదుందుభి యయ్యె వాఁడిలన్.

శ్రీమదాంధ్ర భాగవతము.

భగవానుఁడు సర్వవ్యాపకుఁడు, సర్వాంతర్యామి, చరాచరములందు సమానరూపమున వ్యాపించియున్నాడు. ఈవిచారము శాంతరసోపాసన మొనర్చు యోగులకే భగవంతుని సర్వవ్యాపకునిగాను, విరాట్టుగను భావించి అశాంత చిత్తమును నిర్మలముగను శాంతముగను నుంచుకొనుటయే శాంతరసోపాసన ఫలము. శాంతరసోపాసకులగు జ్ఞానులు విరాట్టు నుపాసించెదరు. ప్రపంచములో నున్నదంతయును భూమాపురుషుని విలాసమాత్రమే. అతఁడే అనేకరూపములందుఁ గనఁబడుచుండును. అతఁడే సత్యము, నానారూపము

హృదీకుని పెద్దకుమారుడగు దేవబాహువునకు దేవమీఢుండను పేరుకూడగలదు. ఈదేవమీఢునకొక గొప్ప తేజస్వియగు పుత్రుండుదయించెను. అతడు శూరునివలె శూరవీరుడు. అందువలన నందఱును నాతనిజూచి శూరుడనిరి. శూరకుమారుడు పెద్దవాడు కాగానే మారిషయను రాజకుమారిని బెండ్లాడెను. ఆమారిషయను భార్యయందతడు పదిమంది పుత్రులను గనెను. ఈపదుగురిలో నందఱికంటె పెద్దవాడు వసుదేవుడు

వసుదేవుడు పుట్టినప్పుడు పృథివియంతటను నానందము వ్యాపించెను. స్వర్గమునందలి దేవదుందుభులు వానికవియే మ్రోగసాగెను. వాయింపకయే వాద్యములన్నియును మ్రోగగా దేవతలకు మిక్కిలి ఆశ్చర్యము కలిగెను. వారందఱును తమకు రాజగు శచీపతియగు శతక్రతువును వెంటబెట్టుకొని లోకపితామహుడగు బ్రహ్మకడకుబోయి యిట్లనెనుః- స్వామీ! మన దేవదుందుభులు వాయింపకయే మ్రోగుచున్నవి. ఇది మిక్కిలి ఆశ్చర్యకరముగనున్నది. ప్రపంచములో నట్టి విచిత్రసంఘటన మేమిజరుగనున్నది? నేడు చరాచర ప్రపంచమంతయును సుప్రసన్నమైయున్నది. అందఱకు నెట్టి యానందము కలుగవలసియున్నది.

బ్రహ్మ యిట్లనెనుః- „దేవతలారా! మీకు తెలియదా! నేడు సత్యానంద సముద్రము. ప్రజావత్సలుడును, సర్వప్రి

యుండును. సర్వసామ్రాజ్యాధీశుడగు చక్రవర్తి వచ్చుచుండిన, ఆతని ఆగమనమును వినఁగానే అందఱకును మిక్కిలి యుత్సాహము కలుగును అందఱు సత్యంతోత్కంఠతచే నాతని యాగమనమును గూర్చి ప్రతీక్షించుచుందురు. దినములను లెక్కించుకొనుచుందురు. ఆతని స్వాగత సత్కారములకొఱకు స్థానము నేర్పఱచెదరు. ఆతని నివాసమునకు స్థానము నేర్పఱచఁగనే ఆతఁడు తప్పక రాఁగలఁడని అందఱకును నాశజనించును. అదేవిధముగ భగవానుఁడు జన్మించుటకు స్థానము వసుదేవుఁడు. ముందుగా వచ్చి ఆతఁడు వసుదేవుని యంతఃకరణమునఁ బ్రవేశించును. నేఁడా వసుదేవుఁడు జన్మించినాఁడు. ఆయానందముచే దుందుభులు స్వయముగ మ్రోగుచున్నవి "

ఇది వినఁగానే దేవతలు సంతోషించిరి. వారు బ్రహ్మకు బ్రణామమును గావించి, తమ తావులకు వచ్చి ఆనందోత్సవమును జేసికొనసాగిరి వసుదేవుని తరువాత కూరునకు దేవభాగుఁడు, దేవశ్రవుఁడు, ఆనకుఁడు, సృంజయుఁడు, శ్యామకుఁడు, కంకుఁడు, శమీకుఁడు, వత్సకుఁడు, వృకుఁడను తొమ్మిదిమంది పుత్రులుదయించిరి. వీరందఱును భగవానునకు పినతండ్రులు. భగవంతుఁడు క్రీడించునప్పుడే కాకిగాఁ గ్రీడింపఁడు. తనకు సంబంధించినవారినిఁ జాలమందిని దెచ్చి ఆతఁడు ఖేలన మొనర్చును; ఏలనఁగా ఖేలనము, నాటకము. అభినయము ఒకరిద్దఱితో నయ్యేదికాదు. దానికి చాలపాత్రలు కావలసి

ముగ నామెను కుంతిభోజునికడకు బంపెను. ఇంతటి సుందరి యగు పుత్రికనుగాంచి కుంతిభోజుఁడు పడిన యానందమునకు మేరలేకుండెను. అతఁడామెను పుత్రికవలెభావించుచు నత్యంత ప్రేమతో నామెను బాలన పోషణమొనర్చు చుండెను. ఒక కొండల కుండమునుండి కదలిన నీలతనుకోసి వేఱొక కుండమునఁ జేరి చోటఁ జచ్చుట సుందరజలమును, బురదను గ్రహించు నటు కను దారిలో వాడిపోవును. తర్వాత నది పచ్చఁబడి ప్రఫుల్లిత మగును. అదేవిధముగ మధురలోని భవనములనుండి వచ్చు నపుడు మార్గమునఁ బృథ దుఃఖించెను. కాని, కుంతిభోజుని భవనమునకు రాఁగానే మరల ప్రఫుల్లితయయ్యెను. ఆమె తన పురాతనపు గృహమును మఱచిపోయెను. శుక్లపక్ష క్షపాక రునివలెఁ బృథయును పెరుగుచుండెను. కుంతిభోజుని పుత్రియ గుటచే నామె పేరిప్పుడు కుంతియయ్యెను ఆమెకు వయస్సు పెరిగినకొలఁది గుణములుకూడ పెరుగుచుండెను. ఆమె త్రైలో క్యసుందరియగు కన్య. తండ్రి ఆమెను జూచుకొని తానుపరమ భాగ్యశాలిననుకొనుచుండెను. ఆకన్యకనుజూచినవారందఱును నామెగుణములకు ముగ్ధులగుచుందురు. ప్రపంచమును వశమొ నర్చుకొనుటకు మహామంత్రములు మూఁడేకలవు– మధుర వాణి, సేవ, పరనింద యొనర్పకపోవుట. బాలుఁడుకానిండు, బాలికకానిండు, స్త్రీకానిండు, పురుషుఁడుకానిండు– ఎవరైనఁ గానిండు ఈమూఁడు మంత్రముల నెవర్గ్రహించిరో వారు

విశ్వమును దమవశము చేసికొనఁగలరు. కుమారియగు కుంతి యీమూఁడు మంత్రములను గ్రహించినది. అందువలన నామె అసంభవ విషయములనుగూడ సంభవ మొనర్చుకొనినది. అందఱకును దురారాధ్యుఁడైన దుర్వాసునిఁ దన శుశ్రూషాబలమునఁ బ్రసన్ను నొనర్చుకొని, సంతుష్టునిఁగావించి మానవుల కలభ్యమగు దేవతాహ్వానమను దుర్లభమగు వరమును బొందినది. ఈకుంతీగర్భమునుండియే కన్యావస్థలో దానవీరుఁడగు కర్ణుఁడు జన్మించినాఁడు."

ఇదివిని శౌనకుఁడిట్లనెను:- "సూతా! మేము ప్రసంగానుసారముగ నిచ్చట దానవీరుఁడగు కర్ణుని జన్మకథనుగూడ వినఁగోరుచున్నాము. కృపతో దానినిగూడ సంక్షేపముగఁ జెప్పుము. తరువాత భగవానుని మిగిలిన మేనత్తలకథను జెప్పవచ్చును."

సూతుఁడిట్లనెను.- "మంచిది, స్వామీ! నేను మహోత్కృష్టుఁడగు కర్ణునికథను వినిపింప నుత్సహించుచున్నాను; కాని మీ భయముచే ప్రసంగమును సాగించుటలేదు. ఇప్పుడు మీరే ప్రశ్నించితిరి కావున నిపుడు కర్ణోత్పత్తికథను జెప్పెదను."



# వసుదేవుని సోదరి కుంతీపుత్రుఁడు కర్ణుఁడు.

(౨౦౯)

శ్లో॥ కుంతేః సఖ్యుః పితా శూరో హ్యపుత్రస్య పృథామదాత్।
సాపి దుర్వాససో విద్యాం దేవహూతీం ప్రతోషితాత్॥
తస్యా వీర్యపరీక్షార్థ మాజుహావ రవిం శుచిమ్॥

శ్రీభాగ. ౯ స్కం. ౨౪ అ. ౩౨ శ్లో॥

క॥ తన చెలికాఁడగు కుంతికి
దనయులు లేకున్నఁ జూచి తనతనయఁ బృథం
దనయఁగ నిమ్మన శూరుఁడు
దనయఁదలి మైత్రి నిచ్చె ధరణీనాథా!

వ. అయ్యింతి కుంతి భోజునింటం బెరుఁగుచుండ నొకనాఁడు దుర్వాసుండరుగుదెంచిన నమ్మహాత్మునకుఁ గొన్ని దినంబులు పరిచర్యలుసేసి వేల్పులం జీరంబిలుచు విద్యం బడసి యావిద్యలావెఱుంగ నొకనాఁడేకాంతంబున వెలుంగుఱేని నాకర్షించిన నాదేవుండువచ్చినం జూచి వెఱఁగుపడి యిట్లనియె.

శ్రీ మదాంధ్ర భాగవతము,

సమాజ బంధమేలేకుండినచో మానవుఁడు పశువుగా నైననగును లేకున్న దేవతయగును. సాధారణులు లోకలజ్జా

ఉత్తమ వంశములో నివాఁడు వరుఁడు కావలమునని ఆతని ఆకాంక్ష. రాజిట్లు చింతించుచుండునంతలో దుర్వాసమహర్షి రాజభవనమునకు వచ్చెను. దుర్వాసునిగాంచి రాజు తన పత్ని, పురోహిత. మంత్రి సచివాదులు సహితముగ లేచి నిలువఁబడెను. ఆతఁడు మునికి యథోచిత సత్కారములను గావించి కుశలమడిగెను. పరస్పర కుశలప్రశ్నలైన తరువాత ముని యిట్లనెను:— "రాజా! ఈసారి చాతుర్మాస్య వ్రతము మీకడనుండి చేయవలయునని కలదు. దీని విషయములో నీ యభిప్రాయమేమి?"

అత్యంతానందమును బ్రకటించుచు రాజిట్లనెను:— "స్వామీ! నామీఁద నింతటి కృపనుజూపినారు. ఇది నాయదృష్టము. స్వామీ! ఒక్కక్షణము సాధుసంగము లభించినను కోట్లజన్మములందలి పాపతాపములు నశించిపోవును. అట్టియెడ మీరు నాలుగునెలలు తమ దేవదుర్లభ దర్శనముచే నన్నను గ్రహించుచున్నారు. ఇంతకంటె నాకానందింపఁదగిన విషయమేముండును?"

రాజుయొక్క ఆనంద పూర్వకానుమతినిఁబొంది ముని అచ్చటనే చాతుర్మాస్య వ్రతమునొనర్ప నిశ్చయించుకొనెను. కుంతిభోజమహారాజు దుర్వాసుని స్వభావము నెఱుఁగును. దుర్వాసుఁడు రుద్రావతారమని లోకులందఱకును దెలియునని అతనికేమి తెలియును. క్రోధమాతని పెదవులమీఁదఁ దాండవ

మాడుచుండును. ఆతఁడు శాపములేక మాడలాకనే మాట్లాడఁడు. ఇట్టి యుగ్రస్వభావముగల మునిని నాలుగు నెలలు ప్రసన్నునొనర్చుట అసంభవకార్యము. తన్నుఁదాను వదలుకొని సర్వాత్మభావముతో నాతని వారేమైనతప్పు అతని దశాయింపులను సహింపఁజాలరు. ఎవరిమనస్సులో గొంచెమైనను రోషము కలదో, ఎవని చిత్తమందు తామున్నామను వ్యక్తిత్వభావము దాగియున్నదో అట్టివారు సర్వానుసేవను జేయఁజాలరు సేవాధర్మము పరమ గహనమైనది. సేవకుఁడు సుఖమును గోరియుండిన నాతఁడు నిజమైన సేవకుఁడు కాఁడు, వానివలన సేవజరుగదు. స్వామి యెడలఁ బూర్ణశ్రద్ధ లేకున్నను, సర్వాత్మభావముతో నాతని కనుగఱులు కాకున్నను సేవాకార్యమసంభవము.

ఒక స్వామికడ చాలమంది సేవకులుండిరి. కాని ఆతని కొక్కనిపై నత్యధికానురాగము కలదు. ఇది యితర సేవకులకుఁ జెడ్డగాఁ దోఁచుచుండెను. వారిట్లనుకొనిరి:- “మనమును రాత్రింబవళ్ళు సేవను జేయుచున్నాము, మనమును మన రక్తమును నీరుజేసికొని రాత్రిందినములు సేవలో నిమగ్నులమైయున్నాము. ఆసేవకునిమీఁద నున్నంతప్రీతి స్వామికి మనమీఁదలేదే.” ఒకదినమున నొక సాహసి యీ విషయమును స్వామికిట్లు నివేదించెను:- “ప్రభూ! మీరు ఫలానిసేవకుని

యందు మనస్సును బెట్టుకొనియున్నారు. మాబుద్ధి నంత గాలేదేమి? ఏమి. మేము మీ సేవకులము కామా? మా సేవలో నేమైన లోపమున్నదా?"

స్వామి యిట్లనెను:– "మంచిది, దీనికి జవాబు తను వాతే చెప్పనులే." ఈవిధముగ విషయము పాతబడిపోయెను.

ఒక దినమున నొకవస్తువు నాయడిగిన సేవకుడు దారిలో బెట్టెను. స్వామి అటునుండివచ్చి తెలిసితెలిసియే దానిని దన్నెను. ఆవస్తువు పగిలిపోయెను. అప్పుడు స్వామి క్రోధముతో నిట్లనెను:– "మీరెంత బుద్ధిహీనులురా? ఈవస్తువును దారిలో బెట్టితిరేలరా? ఇది పగిలిపోయినది."

సేవకుడిట్లనెను:– "స్వామీ! ఇందులో నాదోష మేమున్నది? ఇంత వెడల్పుమార్గము కలదుకదా! మీరు తొలగిపోవచ్చునుగదా! మీరు కావలయునని దానినిదన్నితిరి."

స్వామి యిట్లనెను:– "నీవు దానిని మార్గములో బెట్టితివెందుకు?"

సేవకుడిట్లనెను:– "స్వామీ! ఎచ్చటనో అచ్చటదానినుంచవలయునుగదా! వస్తువు మార్గములో బెట్టబడినది, తొలగిపోవలయునని మీరనుకొనవలసినది" స్వామి యింకేమి మాటలాడుచు, మెదలక వెడలిపోయెను.

చాలదినముల తరువాత నొకదినమున నొక పాకీమీఁద నొక గాజుపాత్ర పెట్టఁబడియుండెను. ఈయజమాని యేసేవకునియెడల ననురాగమును జూపుచుండెనో అతఁడును వచ్చుటనే చిమ్ముచుండెను. ఇతరులందఱును దగ్గఱలోఁ గూర్చుండి యుండిరి. స్వామి యాగాజుపాత్రను దీసికొని, చేతినుండి జార విడిచెను. పాత్ర నేలమీఁదఁబడఁగానే ముక్కలు ముక్కలయ్యెను. ఈసారి స్వామి కన్నులెఱ్ఱఁజేసి తనకు ప్రియపాత్రుఁడైన సేవకునిఁబిలిచి కసరుటకుఁ బ్రారంభించెను అతఁడిట్లనెను: "పాత్రనేల పగులఁగొట్టితివిరా?"

అతఁడు చేతులు జోడించుకొని దీనతతో నిట్లనెను.— "స్వామీ! అపరాధము. నన్నుక్షమించుము. ఇఁకనుండి నేను జాగ్రత్తగ నుండెదను." ఇతరసేవకులందఱును నిట్టి ప్రత్యుత్తరమువిని యాశ్చర్యచకితులైపోయి అతనితో నిట్లనిరి:— "ఓరీ! అబ్బాయీ! ఇందు నీయపరాధమేమున్నదిరా? నీవు పాత్రను దాకనైన తాకలేదుకదా! అది స్వామిచేతినుండి జారిపడియే పగిలిపోయినది."

అతఁడు నమ్రతతో నిట్లనెను:— "స్వామి కోపపడినప్పుడు నిశ్చయముగ నేనేదో అపరాధమును జేసియుందును; ఎన్నఁడును స్వామి నాయనిష్టమును గోరఁడని నాకు పూర్ణవిశ్వాసము కలదు. ఆతని కార్యములన్నియును నామేలుకొఱకే యుండును.

స్వామి కార్యములలో లోపము లెన్నుట సేవకునిధర్మముకాదు నాయపరాధమే లేకయుండినచో నాతఁడెన్నఁడును నన్నుఁగసరఁడు. ఆయన అపరాధము లేకయే నన్నుఁ గసరినను దానిలో నేదియో రహస్యముండి యుండవలెను. దీనిలో నా కల్యాణభావన యిమిడియున్నది."

అతని ప్రత్యుత్తరమును విని స్వామి యిట్లనెను:- "ఈతనికిట్టి భావము కలదు కావననే నాకీతనిపై నింతయధికముగ ననురాగముకలదు. ఈతఁడు స్వత్వమును వదలుకొని సర్వాత్మభావముతో ననుగతుఁడై సేవించుచుండును అంతఃకరణమొకటియే ఆతఁడు నాపైనింత విశ్వాసముంచినప్పుడు నేను పాషాణ హృదయుఁడను గానుగదా! నాకును నాతనిపైఁ బూర్ణానురాగము కలదు. వీనికీయరాని వస్తువేదియును లేదు. సేవ ద్వారా యీతఁడు నన్ను వశపఱచుకొనినాఁడు. సేవను మీరుడును జేయుచున్నారు, కాని సేవకులమను నభిమానముతోఁ జేయుచున్నారు. మేము స్వామికి పరిశ్రమ సేవకులమనుకొనుచుందురు మీరువ్యవహారము ననుసరించి పరి ంచుచుందురు; మీయాత్మల నర్పించి సేవింపరు. అందువలన నాకును మీ మీఁద వ్యావహారిక ప్రేమయేకలదు."

సూతుఁడిట్లనెను:- "మునులారా! స్వామియందుపూర్ణ శ్రద్ధయుండవలెననియు స్వామియొక్క సమస్త చేష్టలందును కల్యాణమునే జూచువాఁడు మాత్రమే నిజముగు సేవచేయఁ

గలఁడనువదిరో యీకథయొక్క సారము. కుంతిభోజ మహారాజిట్లనుకొనెను:- "నాపుత్రిక పరమ సుశీల. ధర్మమందీమెకు రుచికలదు. ఈమె కెన్నడును గోపము రాదు. కటువాక్యములను బలుకుట ఆమె యెఱుఁగదు. ఈమెనే దుర్వాసముని సపర్యకై నేను నియోగించెదను. మునియెంతటి కోపమును బ్రదర్శించినను నీమె యెన్నడును గోపింపదు" ఇట్లాలోచించుకొని ఆతఁడిట్లనెను:- "అమ్మా! ఇప్పుడు నీసహనశీలతకును, ధైర్యమునకును బరీక్షాదినము. దుర్వాసమహాముని గొప్పకోపి. నాలుగు నెలలు నీవు నీశారీరక సుఖములన్నిటికిని దిలాంజలి నొసంగి యీతనిని సేవింపవలయును. ఈతని కార్యమందెన్నడును నీవు లోపము నెన్నరాదు. సర్వాత్మభావముతో నీతని ననుగమింపవలయును. ఈతఁడేది చెప్పిన దానిని నీవు వెంటనే అవ్యగ్రభావముతోఁ జేయవలయును."

చేతులు జోడించుకొని కుంతి యిట్లనెను:- "నాయనగారూ! ఇది నాయదృష్టము. నేను బ్రాణపణముగ మహర్షిని సేవించెదను."

రాజు పుత్రికయొక్క శిరస్సుమీఁద చేతితో నిమురుచు నిట్లనెను:- "అమ్మా! నీకల్యాణముకూడ కాఁగలదు."

ఇట్లుపలికి రాజు ముని సేవాకార్యమును గుంతికి నప్పగించెను. కుంతి శ్రద్ధగా మునిసేవను జేయుచుండెను. ముని

కుంతి ధైర్యవతికనుక ఓరిమితో నిలిచియుండెను. అతఁడు ప్రతివిషయ ములోను లోపములెన్నుచుండెను. ఒకప్పుడు మంచి భోజన మును దయారుచేసిన, దానిలో దోషము నెనివి వదలివేయును. కుంతి మాటలాడక మఱియొక భోజనమును దయారుచేయు చుండును. ముని దానిలోఁగూడ దోషమునెన్నిన మూఁడవ మారు తయారుచేయును. ఒక్కొక్కప్పుడు పగలురాఁడు. అర్ధరాత్రివేళకు వచ్చి వేడి వేడి అన్నము కావలయుననును. కుంతి అప్పుడే సిద్ధపరచును. సారాంశమేమనఁగా నాతఁడు కుంతిని వివిధవిధములఁ బరీక్షించెను. కాని కుంతి యెప్పుడును గోపమును జెందలేదు. ఆమె సమస్తమును ధైర్యముతో సహించుచుండెను. చివరకు ముని ప్రసన్నుఁడై ఆమెనువరము గోరుకొనమనెను. కుంతి చేతులు జోడించుకొని యిట్లనెను:- "ప్రభూ! నాకేమియును వరమవసరములేదు. నాకు మేలు దేని లోఁగలదో స్వయముగ మీరే దానిని నాకొసంగుఁడు."

ముని యిదివిని యింక నధికముగఁ బ్రసన్నుఁడయ్యెను. కుంతియొక్క పతి శాపవశమున సంతానోత్పత్తి చేయఁజాలఁడను సంగతిని అతఁడు ధ్యానమునఁ దెలిసికొని కుంతికి దేవ హూతియను విద్యనొసంగెను అతఁడు కుంతికొక మంత్రమును జెప్పియిట్లనెను:- "నీ వెప్పుడే దేవతను బిలువ వలయుననిన నప్పుడాతని రూపమును ధ్యానించి యీ మంత్రమును బఠిం చుచో దేవతలు వెంటనే నీసమ్ముఖమునకు రాఁగలరు."

చేతులు జోడించుకొని వమ్రతతో గుంతి యీవిద్యను గ్రహించెను. ముని యిచ్ఛానుసారముగ జాతుర్మాస్య వ్రతమును సమాప్తము కావించి వెడలిపోయెను.

కుంతి యింకను బిల్లయే. మంత్రమును బఠింపగానే దేవతలు మూర్తిమంతులై యెట్లువచ్చెదరో చూచుటకామెకు కుతూహలము గలిగెను. ఒక్కసారి యేదో ఒక దేవతను బిలిచి మంత్రపరీక్ష నొనర్చుటమంచిది! దేవతలేరూపమున వచ్చెదరో చూతము.

దైవవశమున నదే సమయమునకు గుంతి ప్రంచిరి యింట ఋతుమతియై యుండెను. ఆసమయమున నామె శరీరమందేదో విచిత్రముగనుండెను. ఋతుస్నానమొనర్చి, ఒక్కస్థానమును స్వచ్ఛమొనర్చి అలికి మంత్రపరీక్ష నొనర్చుటకు గూర్చుండెను. ఆమె యిట్లనుకొనెను:—"ఏదేవతను బిలుతము?"

ఆసమయమున భువన భాస్కరుడు తూర్పుదిక్కున రక్తాంచలమును దూలిగించుకొని ఉదయించెను. కుంతి యిట్లనుకొనెను:— "సర్వకర్మసాక్షియును, ప్రత్యక్షదేవుడునగు నీ సవిత్రు నేల నాహ్వానింపగూడదు?"

ఇంకేమున్నది? సూర్యనారాయణుని ధ్యానించి ఆమె దుర్వాసదత్తమగు మంత్రమును బఠించెను. మంత్రమును పఠించగానే సూర్యదేవుడు తత్కాలమున నచ్చటికి వచ్చియుం

చేసు ఆతని యసహ్యా తేజమునకు కుంతి కన్నులు మిరుమిట్లు గొలిపెను. శుద్ధస్వరూపమున సూర్యుఁడు సశరీరుఁడై మూర్తి మంతుఁడగుటను గాంచి చకితచిత్తయై కుంతి యిట్లనెను:- "స్వామీ! బాల చాంచల్య వశమున మంత్రమును పరీక్షించు నుత్సాహముతో నేను మిమ్మాహ్వానించితిని. నేను మీకు నివేదించున దేదియును లేదు. నాచాపల్యమును మీరు లక్ష్య పెట్టకుఁడు. ఈయపరాధమునకు నన్ను క్షమింపుఁడు. నేనకార ణముగ మీకు కష్టమును గలిగించితిని, దీనివలన మీరునాపైఁ గోపపడక తమ యిచ్చవచ్చినట్లు దయచేయుఁడు."

సూర్యదేవుఁడిట్లనెను:- "దేవీ! ఈ మంత్రముయొక్క ప్రభావనేమనఁగా నేదేవతను నీవాహ్వానించితివో, ఆతఁడు వచ్చి నీకు గర్భాదాన సంస్కార మొనర్పఁగలఁడు నేను నీ యందు గర్భస్థాపన మొనర్చుటకే వచ్చితిని."

చెవులరెంటిపైఁ జేతులు నిడుకొని ఆశ్చర్య. భ్రమ, భయ. లజ్జా, దీనతాస్వరముఁ గుంతీదేవి యిట్లనెను:- "జగత్పతీ! కర్మసాక్షీ! మీరు ప్రాణిమాత్రులకు ధర్మసాక్షు లై యుండియును నెట్టియధర్మవిషయమును బలుకుచున్నారు. స్వామీ! నేను కన్యకను. కన్యకకు గర్భ స్థా ప న మెట్లు కాఁగలదు?"

సూర్యదేవుఁడిట్లనెను:– "దేవీ! నాదర్శన మమోఘ
మైనది. అది యెన్నడును వ్యర్థముకాదు, సుందరీ! నీవు చింతింప
వలదు. నేను గర్భస్థాపన మొనర్చక తిరిగి పోను. దీనిలో
నాకును, దుర్వాసమహాముని విద్యకును నవమానమును నని
ష్టమును గాఁగలదు. కావున నేను నీయందు గర్భస్థాపనమొన
ర్చితీరెదను. కాని నాపరిభావముచే నీకు కన్యాత్వము చెడకుం
డును గాక! పుత్రుఁడు పుట్టినను నీవు కన్యకగనే యుండెదవు.
నీయోని దూషితముకాదు."

కన్యయగు కుంతి వివశయయ్యెను. ఇంతటి గొప్పదేవు
నిముందామె యేమియును మాట్లాడఁజాలకపోయెను, అతనికి
తనయందు గొప్ప క్రోధము వచ్చుచుండెను. లజ్జా, గ్లాని,
సంకోచకారణమున నామె తనశరీరమందే ముడుచుకొనియుం
డెను. సూర్యదేవుఁడామె నాభిని స్పర్శించి, గర్భాధాన
సంస్కారమును గావించెను. తేజస్వియును, నమోఘమునగు
దన యమోఘవీర్యమును స్థాపించి సూర్యదేవుఁడు తనలోక
మునకుఁబోయెను. కుంతీదేవి వెంటనే పరమ తేజస్వియును,
సత్కాంతి సుందరుఁడును కవచకుండల ధారణ మొనర్చి ద్వితీయ
సూర్యునివలెఁ బరమ పరిభావంతుఁడైన నొక పుత్రునిఁగనెను.
పుత్రుని ముఖము చూడనంతవఱకు ఆమెకు గ్లాని, దుఃఖము,
ఘృణ, ఆత్మనిర్వేదము వీనిమూలమున సంకోచ ముండెను.
ఇప్పుడు పుత్రుని ముఖమును జూచునప్పటికి ఆమెకు మాతృ

ప్రేమ ముప్పొంగెను. మాటిమాటికిని బిల్లవాని ముఖమును ముద్దుపెట్టుకొనుచుండెను. వానిని గౌఁగిలించుకొనుచుండెను. స్తనములలోనికి చేఁపువచ్చెను. వానికి బాలు కుడిపెను.

రాజ మహాలులో నత్యంతయేకాంత స్థానమున నా కుంతీదేవి పుత్రునిఁ బ్రసవించెను. ఆవిశాల భవనమందున్నది. ఆమెయును, వృద్ధురాలగు నామె దాసియును, రాత్రి సమయమునఁగుంతి యా సూర్యసుతునిఁగనెను. ఆమె మనస్సున ననేక భావములుప్పొంగు చుండెను. ఒక్కొక్కప్పుడిట్లను కొనుచుండును:- "ఈపిల్లవానినిఁ దీసికొని నన్నెఱుఁగకుండు నట్టిదైన దూరదేశమునకుఁ బోయెదను. అచ్చట భిక్షమెత్తు కొని పొట్టబోసికొందును. ఈపిల్లవాని నెట్లైన బ్రదికించుకొందును. లేదా యెవరికైన సేవచేయుదును." మరల నిట్లను కొనును:- "నేనెన్నడును భవనములను దాటి బయటకుబోలేదు. ప్రాతఃకాలముఁ దండ్రి నలువైపులకును దూతలనుబంపును. నన్నుఁబట్టుకొందురు. వారికీసంగతి తెలిసినదా ప్రాణము పోవలసినదే. ఏమి చేయుదును? ఎచ్చటికిఁ బోవుదును? అయ్యో! రాజపుత్రినయ్యు నాకు నేడెట్టి క్లేశము సంభవించినది!" ఇట్లు లాలోచించుకొని కుంతీదేవి యేడ్వనారంభించెను. మరలఁబిల్ల వాని ముఖమునుజూచి ముద్దుపెట్టుకొనును. వీఁడెంతటి సుందర శిశువు. తన తండ్రివంటివాఁడే. ప్రపంచముచాల నిర్దయ

మైనది వీఁడు జగత్పతియగు సూర్యదేవుని పుత్త్రుఁడని యెవరు విశ్వసించెదరు? ఇప్పుడు నేనీ పిల్లవానియందు మోహమును విడువవలసినదే. ఈతఁడు జగత్పతి పుత్త్రుఁడు. తనయదృష్టమునను, దన ప్రారబ్ధవశమునను నెచ్చటనున్నను సుఖముగనుండఁగలఁడు.' ఈవిచారధారలందు మాతృత్వము తగ్గఁజొచ్చెను.

వర్షర్తువు. నిశీథపువేళ. నలుదైపులను నిశ్శబ్దముగనుండెను. చిన్న చిన్న చినుకులు పడుచుండెను. మేఘములు క్రమ్మియుండెను. మెఱపులు మెఱయుచుండెను, మధ్యమధ్య మేఘములుఱుముచుండెను. దాసి యుదివఱకే ఒకచక్కని పెట్టె నేర్పఱచియుండెను. ఆపెట్టెయొక్క పనితన మెట్లున్నదనఁగా, దానినెంతటి జలములో ముంచినను నది మునుఁగదు దాని లోనికి గాలిపోవు మార్గముకూడా కలదు. దానిలో మెత్తని పరుపులు పరుపఁబడియుండెను. చాలదిండ్లు కలవు ఆటవస్తువులు గలవు. దాది వానికిఁ గుంగుమబొట్టును బెట్టెను. నూలుతో వానినిఁ జుట్టెను. పసుపు, గరిక, పోకలు. అక్షతలు, దధ్యామంగళ ద్రవ్యము లందుండెను. వానినెత్తుకొని దాది రాజకుమారితో నిట్లనెను:- 'అమ్మాయీ! వెళ్లుదమువద భయ పడకుము ''

చాల కష్టముతోఁ దనహృదయములోని ముక్కను గట్టిగాఁగౌఁగిలించుకొని, నల్లనిచీరను గట్టుకొని, నల్లనిముప్పటినిఁ గప్పుకొని, యేడ్చుచు కుంతీదేవి వృద్ధదాసి వెనువెంట

మెదలక మెదలసాధ్యకుండా పోయెను. ప్రపంచమంతయును ప్రగాఢనిద్రయందు నిద్రించుచుండెను. కేవలమిద్దరె మేల్కొని యుండిరి: ఒక్క-తె కుంతి, రెండవది వృద్ధదాసి కుంతిపుత్రుఁడు తల్లి చంకలో నామెను గట్టిగాఁబట్టుకొని కునుకుచుండెను. భవనములకు దూరముగ నొక వర్షాకాలపువాగు కలదు. నేఁడది మిక్కిలి వేగముతోఁ బ్రవహించుచుండెను. అది చర్మణావతీ (చంబల్) ఉపనది. కుంతి తన దాసితో నానదీ తటకమునకుఁ జేరుకొనెను. నదీవేగమును గాంచఁగనే ఆమె హృదయము బ్రద్దలు కాసాగెను. ఆమె యేడ్చుచు నేడ్చుచు మిక్కిలి కష్టముతోఁ బిల్లవానికిఁదన స్తనములలోని పాలను ద్రావించి, విలవిల నేడ్చుచు నిట్లనెను:- "వత్సా! నీవింతటి గొప్ప దేవతకుఁ బుత్రుఁడవయ్యును నొక రాక్షసీగర్భమున నేల జన్మించితివి? అయ్యో! తన ప్రాణముల కంటెఁ బ్రియమగు నీహృదయకళికను నేహృదయహీన అగాధజలమందు నిరాధారముగ విడువఁగలదు? వత్సా! పొమ్ము. ఏభాగ్యవతి గర్భము నైనసరే పుము. నిన్నుఁ బుత్రునిఁగా భావించి పెంచుకొనునాతల్లి ధన్యత నొందఁగలదు. నాముద్దుబిడ్డా! సమస్త ప్రాణులకును ప్రకాశమొసఁగు నీతండ్రియగుసూర్యుఁడునిన్ను సర్వత్రా రక్షించును గాక! నేను నిన్ను వరుణదేవుని హస్తములకు నప్పగించుచున్నాను, శాశ్వతముగ నప్పగించుచున్నాను జీవితములో నీవు మరల నన్నుఁ గలిసికొందువో లేదో భగవంతునకుఁ

తెలియనలయును" ఇట్లు పలుకుచు, నేత్రముచేఁ దల్లి ప్రేమా పెట్టెలోఁ బిల్లవానిని నిక్షేపించి నదీప్రవాహమున విడిచెను కుంతీశోకాశ్రువులను దన జలములందు గలిపికొనుచు నాపవిత్రా పేటికను నాట్యమాడించుచుఁ దీసికొనిపోవుచుండెను ఆపెట్టె కనఁబడునంతవఱకు తల్లి యేడ్చుచున్నట్లు నిలుచుండెను. అది కన్నులకు కనఁబడక పోఁగానే ఆమె తెగిన లతవలె మూర్ఛితయై క్రిందఁబడెను. వృద్ధదాసి తనకుంఠిత హస్తములతో నామెను లేవఁదీసి, ధైర్యధారణము కావింపఁజేసి. మాటిమాటికి నోదార్చుచు నిట్లనెను:- "అమ్మా! ఇప్పుడు శోకించినఁ బ్రయోజనములేదు. నీపుత్రుఁడు సామాన్యుఁడు కాఁడు. వాని ప్రారబ్ధమే వానిని సదా రక్షింపఁగలదు." ఈ విధముగ నోదార్చి దాది కుంతిని రాజభవనమునకుఁ గొనిపోయెను. ఈఘటనమును నెవరు నెఱుఁగరు.

కుంతీ పుత్రునిఁ బరుండఁబెట్టిన పెట్టె అశ్వాయను చిన్న నదిలో వదలఁబడెను ఆమంజూష కొట్టుకొని పోవుచుఁ జర్మణ్వతీయను నదిలోనికి వచ్చెను. అశ్వానది ఆపెట్టెను జర్మణ్వతీ నదికి నప్పగించెను ఇప్పుడు చర్మణ్వతి దానినిఁ దీసికొనిపోవు చుండెను. చర్మణ్వతీనది (ఇటావా సమీపమున) శ్రీయమునా నదిలోఁగలియుచున్నది అందువలన నది యమునానదికి నమర్పించెను ఇప్పుడా బాలకుఁడు పెట్టెలోఁబరుండి యమునా నదిలోఁ గొట్టుకొని పోవుచుండెను. యమున తీర్థరాజమగు

బ్రియాగకు వచ్చి గంగలోఁగలిసెను. కావున యమున ఆపె ట్టెను గంగకు సమర్పించెను. గంగ వానిని దీసికొనిపోయి అంగ దేశపు రాజధానియగు చంపాపురి (చంపారన్) సమీపమునకుఁ గొనిపోయెను. అచ్చట సూతరాజగు నధిరథుఁడు స్నానమొనర్చుచుండెను ఆతఁడు పుత్రహీనుఁడు. ఆతఁడు పల్లె వాండ్రచే నామంజూషను జలములనుండి బయటకుఁ దీయించెను. దానిలో నత్యంత సుందరుఁడగు శిశువును గాంచఁగనే ఆతని హృదయానకు మేఁతలేకుండెను. వాని నాతఁడప్పటినుండి తన పుత్రునిఁగా భావించుచు వానినిఁ దన పత్నియగు రాధకొసంగెను. రాధయొక్క రిక్త గర్భము నిండిపోయెను. కర్ణుఁడు కౌంతేయుఁడు కాక రాధేయుఁడయ్యెను. భాగ్యము యొక్క విడంబనమును గాంచుఁడు దేవపుత్రుఁడయ్యును భాగ్యవశమున సూతపుత్రుఁడనఁబడెను. ఈకారణముననే అడుగడుగునకును నవమానము జరుగుచుండెను ఇంతటి బలవంతుఁడును, శూరవీరుఁడును, దాతయు, తేజస్వియు, తపస్వియునై యుండియును భాగ్యమిత్రునికిఁ బ్రతికూలముగనుండెను. ఈతఁడు భగవానునకు మేనత్త కుమారుఁడు. అర్జునునితల్లి గర్భమునుండియే యుదయించినాఁడు. భాగ్యవిపరీతముచే వీరిద్దరును నాతనికి వ్యతిరేకులైరి. ఇద్దరును యుద్ధమందాతని నన్యాయముగఁ జంపిరి. భగవానుఁ డన్యాయ మొనర్పఁడుగదా, ఆతని నన్యాయముగ నేలఁ జంపినాఁడు – ఇది వేఱుకథ. అవతారమును

గ్రహించి ఆతఁడు సమస్తమును జేయఁగలఁడు. ఆటలో దెబ్బలాటలు, తిట్లాటలు మొదలగున వన్నియును జరుగును. ఇది వేఱువిషయము. పాత్రముల మనస్సులలో నాఘనము లేనియును బడవు. ఆట విషయములలో సత్యత్వముండదు. నాటకము సమాప్తము కాఁగానే ఆవిషయములన్నియును సమాప్తము కాఁగలవు.

సూతుఁడిట్లనెను:– "మునులారా! నేను దారితప్పితిని. నేను మీకు భగవానుని మేనత్తల వంశములనుగూర్చి చెప్పుచున్నాను గాదా? నేను వసుదేవుని అయిదుగురు తోఁబుట్టువులనుగూర్చి చెప్పుచున్నాను. వారందఱిలోఁ బెద్దది పృథ. ఆమెనే ఆమె తండ్రియగు శూరుఁడు తన పెత్తల్లి కుమారుఁడగు కుంతిభోజునకొసంగెను. ఆమెకు కన్యావస్థలో సూర్యసుతుఁడగు కర్ణుఁడుదయించినాఁడు. ఆమెను పరీక్షిన్మహారాజు యొక్క ముత్తాతయగు రాజరాజేశ్వర పాండు మహీపతికిచ్చి వివాహమొనర్చిరి. ఆమె ఉదరమునుండి యుధిష్ఠిర, భీమార్జునులుదయించిరి. ఇప్పుడు మీకు పృథ చెల్లెండ్ర వంశములను గూర్చికూడ అత్యంత సంక్షేపముగ వినుఁడు."

పృథయొక్క చెల్లెలు శ్రుతదేవ కరూశ నరేశుఁడగు వృద్ధశర్మను బెండ్లాడెను. ఆమెపుత్రుఁడు దంతవక్త్రుఁడు. ఈతఁడు పూర్వజన్మమున దితిపుత్రుఁడగు హిరణ్యాక్షుఁడు. ఇప్పుడా

తఁడు భగవానునకు మేనత్త కుమారుఁడై పుట్టెను. కాని, భగవానునకు స్వపరభేదములేదు. ఆతనిని మేనత్త కుమారుఁడని వదలలేదు. వానినిఁజంపి మరల వైకుంఠమునకుఁ బంపెను.

భగవానుని మూఁడవమేనత్త శ్రుతకీర్తి వివాహము కైకయనరేశుఁడగు ధృష్టకేతువుతో నయ్యెను. ఈమెకైదుగురు పుత్రులుదయించిరి. వారిలో సంతర్దనుఁడందఱి కంటెఁ బెద్దవాఁడు. వీరందఱును కైకయ రాజకుమారులని పిలువఁబడిరి.

నాల్గవమేనత్త రాజాధిదేవి వివాహము అవంతి నరేశుఁడగు జయసేనునితో నయ్యెను. ఆమెకు విందాను విందులను నిద్దరు పుత్రులుదయించిరి. వీరు మహాభారతములోనికి వచ్చిరి. ఈమె కొక్క కుమార్తెయును గలదు. ఆమె పేరు మిత్రవింద. భగవానుఁడామెను బెండ్లాడెను ద్వారకానగరమునకుఁబోయి యాతఁడు దాక్షిణాత్యపద్ధతి ననుసరించెను. అందుకనియే మేనత్త కుమార్తెను తన భార్యగాఁజేసికొనినాఁడు.

భగవానుని అయిదవఅత్త శ్రుతశ్రవ చేదిదేశపురాజగు దమఘోషుని వివాహమాడెను ఆతనికి శిశుపాలుఁడను పుత్రుఁడుదయించెను ఈతఁడే పూర్వజన్మమున హిరణ్యాకశిపుఁడు. ఈతఁడును నిప్పుడు మేనత్త కుమారుఁడయ్యెను. భగవానుఁడీతనికిఁగాఁబోవు పిల్లను బలవంతముగహరించి తనకు

భార్యగాఁ జేసికొనెను. ఈతని శిరస్సును ధర్మరాజు రాజసూయ యోగమునఁ దెగఁగొట్టెను. ఈ ప్రసంగము ముందు శ్రీకృష్ణ లీలా ప్రసంగమున విస్తారముగ వర్ణింపఁబడును.

సూతుఁడిట్లనెను:– "మునులారా! నేను సంక్షేపముగ భగవానుని మేనత్తల వంశములను వర్ణించితిని. ఇఁక నిప్పుడు భగవంతుని పినతల్లి పెత్తల్లి బిడ్డలను గూర్చివినుఁడు."



# శూ ర సు తు ల సం త తి

(౨౧౦)

శ్లో॥ యదా యదేహ ధర్మస్య క్షయో వృద్ధిశ్చ పాప్మనః
తదా తు భగవానీశ ఆత్మానం సృజతే హరిః॥

శ్రీభాగ. ౯ స్కం. ౨౪ అ. ౫౬ శ్లో॥

క॥ దుష్ట జన నిగ్రహంబును
శిష్ట జనానుగ్రహంబు సేయుటకొఱకై
యష్టమ గర్భమున గుణో
కృష్ణుఁడు దేవకికి విష్ణుదేవుఁడు పుట్టెన్.

శ్రీమదాంధ్ర భాగవతము.

వనమాలియొక్క పిల్లనగ్రోవి యే వెదురు చేతఁ జేయఁబడినదో, ఆ వెదురు పొదలోని వెదుళ్లు మన వంశములోఁ బుట్టిన వంశము మురళియై భగవానుఁడగు వాసుదేవుని యధర సంబంధము కలిగియుండుటచేఁ దాము భాగ్యశాలుర మనుకొనుచుండును జడములగు వెదుళ్లకే తమ వంశజులకు భగవత్సంబంధము కలిగినదని పులక, రోమాంచాది సాత్త్విక భావములు కలుగుచుండఁగా జడములుగాక, చైతన్యములై స్వయముగ శ్రీహరి సాక్షాత్తుగ నెవరివంశములో నుత్పన్నమైనాఁడో వారి

యానందమునుగూర్చి చెప్పవలసిన దేమున్నది! ఆకులమంత యును బావనమగును. ఆవంశీయులందఱును వందనీయులును గీర్తనీయులు నగుదురు.

మాతుఁడిట్లనెను – "మునులారా! నేను మీకొక కథను జెప్పెదను ఒక పండితుఁడు కలఁడు. ఆతనికొక యమాయ కపు కుమార్తె కలదు. తండ్రి ఆమెకు చాలయుపదేశములిచ్చు చుండెడివాఁడు. భగవత్సేవకు సంబంధించిన యుపదేశములను జాల శ్రద్ధతో వినుచుండెడిది; సాంసారిక విషయములను బెడ చెవినఁ బెట్టుకిది పండితుఁడామె వివాహము నొక పిల్లవాని కిచ్చిచేసెను పీఁటలు సమయమున నాయమాయకపు పిల్ల తండ్రి దగ్గఱకువచ్చి కూర్చుండెను. తండ్రి ఆమెకిట్లుపదేశిం చెను:– "అమ్మా! పతినిఁ బరమేశ్వరునిఁగ భావించి ఆతనినిఁ బూజింపవలయును. అత్తమామల నాదరింపవలయును ఆడుబి డ్డలతోడను, తోడికోడండ్రతోడను, స్నేహముగ నుండవల యును. మఱఁదులకును బావలకును దన పతికిఁ బెట్టినట్లు పెట్ట వలయునుగాని పంక్తిభేదము చేయరాదు. పనులు చేయని మఱఁదినెన్నడును గటిన వచనములు పలుకరాదు. అత్త, ఆడుబిడ్డల మాటలను ధైర్యముతో వినవలెను. పెద్దవారు వచ్చినప్పుడు వారినిఁగాంచి తప్పుకొనవలయును. ఈవిధముగ ననేక విషయముల నాతఁడు చెప్పెను చివరకాతఁ డిట్లడిగెను :– "అమ్మా! నీ బుద్ధిలో నేవిషయము మైన సు కలిచినదమ్మా"

ఆపిల్ల సరళముగ నిట్లనెను:- "అవును. తండ్రి నిలిచియున్నది"

తండ్రి యుల్లాసముతో నిట్లడిగెను:- "ఏ విషయ మమ్మా?"

ఆపిల్ల యిట్లనెను:- "ఇదిగో తండ్రీ! నీవు చెప్పుటప్రారంభించినప్పటినుండి యీ చీమలపుట్టలోనుండి ఒకలక్ష ముప్పది రెండువేల అయిదువందల యిరువదైదు చీమలు వచ్చినవి"

తండ్రి యీవిషయమును విని నెత్తి బాదుకొని:- "అయ్యో! నాయుపదేశమును నీవు వినినదింతయేనా? నేను చెప్పుమాటలమీఁద ధ్యానముంచక యీవు చీమలను లెక్కపెట్టుచుండినది. అట్లేన్వామీ! నాకును నట్లుతోఁచు చున్నది. నేను భక్తులయొక్కయు, భగవంతునియొక్కయు నాఖ్యానములను జెప్పితినా మీరు శ్రద్ధతో ధ్యానపూర్వకముగ వినుచుందురు; కాని నేను వంశావళినిఁ జెప్పునపుడు మీరన్యమనస్కులై వినుచుందురు మాలను త్రిప్పుచుందురు."

శౌనకుఁడిట్లనెను:- "సూతా! దీనిని నీవెట్లనుచున్నావు? మేము మీకథను మిక్కిలి శ్రద్ధగా వినుచున్నాము"

అంత సూతుఁడిట్లనెను:- "మంచిది స్వామీ! మీరు కథను శ్రద్ధగా వినుచుండినఁజెప్పుడు భగవానునకు మేనత్తలెందఱు? వారి పేర్లేమి?"

ఇంకను శౌనకాదు లిట్లనిరి:— సూతా! మా యథార్థ విషయమును వినుము. భగవంతుని మేనత్తల పేర్లు జ్ఞాపకమునకు వచ్చుటకై మేము వారిచ్చిన పాయసములను త్రాగ లేదు. వారిపిండివంటలను, బాచ భక్ష్య పరమాన్నముల నెగు చేయలేదు మేము భగవాను నెఱుఁగుదుము, అతని తాత దేవకుని, ఉగ్రసేను నెఱుఁగుదుము. అతనితల్లి దేవకి నెఱుఁగుదుము అతనిమామయగు కంసునిగూడ నెఱుఁగుదుము. అతని మేనత్తలు, అత్తలు, పినతల్లులు, పెత్తల్లులు వీరందఱి ప్రయోజన మేమున్నది? నీవు కథావాచకుఁడవు కావున నీ కందఱి పేర్లను జ్ఞాపకముంచుకొనుట అవసరము. కావున నీవు కథను జెప్పుచుఁ బోవుచుండుము. మేము వినుచుందుము. దేనిని మేము జ్ఞాపకముంచుకొనవలయునో వానిని జ్ఞాపకముంచుకొందుము."

అంత సూతుఁడిట్లనెను.— "స్వామీ! మీరు చెప్పినది సత్యము, కాని స్వామీ! మేమేదైనను గథను జెప్పవలసి యుండిన దానికి ముందుగా భూమిక నేర్పఱచు కొనవలయును దానికి గావలసిన సామగ్రినంతను నేర్పఱచు కొనవలసియున్నది. శిల్పియేదైన యంత్రమును దయారుచేసి కొనవలయునని చిన్నవి పెద్దవియగు బనిముట్లను సిద్ధము చేసికొనవలయును. ఏసమయమునకే పనిముట్లు కావలసియుండునో కదా! ఒకొక్కప్పుడు కూర్చుకొన్న వానితోఁ బని పడక పోవ

చ్చెను. కావున శ్రీకృష్ణ చరిత్రమునకు నేను సామగ్రినంతయును ప్రోగుచేసికొనుచున్నాను. అత్యంతసంక్షేపముగ భగవానుని పినతండ్రుల యొక్కయు పినతల్లుల యొక్కయు వృత్తాంతమును జెప్పినమీఁదట భగవచ్చరిత్రము నారంభించెదను.”

శౌనకుఁడిట్లనెను:- “మంచిది సూతా! భగవానుని తొమ్మిదిమంది పినతండ్రుల వంశముల నొకేశ్వాసలోఁ జెప్పివేయవలయును.”

సూతుఁడిట్లనెను:- “వినుఁడు, మహారాజా! చెత్తను జెప్పుచున్నాఁడని మరల పలుకకుఁడు. దేవభాగుఁడొకఁడు, రెండవవాఁడు దేవశ్రవుఁడు, మూఁడవవాఁడానకుఁడు, నాల్గవవాఁడు సంజయుఁడు, ఐదవవాఁడు శ్యామకుఁడు, ఆఱవవాఁడు కంకుఁడు. ఏడవవాఁడు శమీకుఁడు, ఎనిమిదవవాఁడు వత్సకుఁడు, తొమ్మిదవవాఁడు వృకుఁడు. ఈ తొమ్మిదిమందియును భగవానుని పినతండ్రులు. కంసా, కంసవతీ, కంకా, శూరభూ, రాష్ట్రపాలికా అను స్త్రీలైదుగురును భగవానుని పినతల్లులు. వసుదేవుఁడిట్లనుకొనెను:- ఇప్పుడెచ్చటని క్రొత్త అత్తవారిండ్ల నేర్పఱచుకొందును. తన సోదరుల వివాహముకూడ తన అత్తవారింటనే అయినచో బాగుండునని, తన యైదుగురు మఱదండ్రను తన అయిదుగురు సోదరులకిప్పించి పెండ్లి చేసెను.

ఇంకను నలుగురు మిగిలిరి వారి నట్టునిట్టుగలిపి ఒకయింటివారి నొసగ్నెను. అందువలన భగవానున కైదుగురు పినతండ్రులు అయిదుగురు పినతల్లులుకలరు. పెద్దపినతల్లి కంసయొక్క వివాహము పెద్దపినతండ్రియగు దేవభాగునితో జరిగెను వారిద్దరికిని భగవానునకుఁ జిత్రకేతు బృహద్బలులను యిద్దరు పినతండ్రిసోదరులుండిరి. కంసవతియను పినతల్లి వివాహము, దేవశ్రవుఁడను పినతండ్రితోనయ్యెను ఆతనికి సువీరుఁడు, ఇషుమంతుఁడను యిద్దరు పుత్రులుదయించిరి. ఆనకుఁడను పినతండ్రికి కంకయనునామె పత్నియయ్యెను వారిగర్భమునుండి సత్యజిత్, పురుజిత్తులనువారు జన్మించిరి సృంజయుఁడను పినతండ్రికి రాష్ట్రపాలిక భార్యయయ్యెను. వారికి వృష, దుర్మర్షణాది చాలమంది పుత్రులుదయించిరి శ్యామకుఁడను పినతండ్రి శూరభూమి యనునామె గర్భమునుండి హరికేశుఁడు, హిరణ్యాక్షుఁడను యిద్దరు పుత్రులుత్పన్నమైరి. ఇప్పటికి పిన్నతల్లులై పోయినారు. ఇంక నల్గురు పి న త ం డ్రు లు మిగిలిరి. వారిలో వత్సకుఁడను పినతండ్రి ఒక మిశ్రకేశియను నప్సరసను వివాహమాడెను. ఆమెవలన వృకాది పుత్రులనేకులుదయించిరి. వృకునకును దుర్వాక్షియను నప్సరస పత్నిగానుండెను. ఆమెవలనఁ దక్ష, పుష్కల, శాలాది చాలమంది పుత్రులుదయించిరి. శమీకుఁడను పినతండ్రికి సుదామినియను రాణి కలదు. ఆమెవలన సుమిత్ర, అర్జునపాలాది పుత్రులనేకులుద

యించిరి. కంకుఁడను పినతండ్రియొక్క భార్యపేరు కర్ణిక. ఆమె వలన ఋతుధాముఁడు జయుఁడను నిద్దరు పుత్రులుదయించిరి. నేనిప్పుడత్యంత సంతోషముగ వసుదేవుని తమ్ములవంశములను వర్ణించితిని. ఇప్పుడు మీరు వసుదేవుని వంశమును గూడ వినుఁడు."

శౌనకుఁడిట్లనెను:- "సూతా! ఈవంశవిస్తార మేమైనను సమాప్తమగునా లేక అట్లే చెప్పుకొనుచుఁ బోయెదవా? మహాభాగా! ఇప్పటికి చాలఅయిపోయినది, మాకు శ్రీకృష్ణ చరిత్రను వినిపింపుము."

సూతుఁడిట్లనెను:- "ఇఁకనైనది స్వామీ! అఖరైనది. ఇంకఁ గొంచెముగఁ గలదు. ఇప్పుడు మీరేయాలోచించుఁడు భగవానుని కొఱకెన్ని వంశములను వర్ణింపవలసి వచ్చినదో. భగవానుని సోదరులపేర్లను జెప్పకుండినచో నసుచితముకాఁ గలదు. చాలగలేదు. వసుదేవునకు బదముగ్గురకదా భార్యలు. పౌరవి, రోహిణి, భద్రామదిరా, రోచనా, ఇలా, అనువారలాఱుగురు. ధృతదేవ, శాంతిదేవ, ఉపదేవ, శ్రీదేవ, దేవరక్షిత, సహదేవ, దేవకి, ఈయేడుగురును దేవకుని పుత్రికలు. ఈవిధముగ వీరు పదుముగ్గురైరి. వీరిలో రోహిణీ గర్భమునుండి బలదేవుఁడు, గదుఁడు, సారణుఁడు, దుర్మదుఁడు, విపులుఁడు, ధ్రువుఁడు, కృత మొదలగు వారు చాలమంది పుత్రులుపుట్టిరి

పౌరవివలన సుభద్ర, భద్రవాహ దుర్మదుఁడు, భద్ర, భీ
తాదులు పండ్రెండుమంది పుత్రులుపుట్టిరి. మదిరకు నందుఁడు,
ఉపనందుఁడు, కృతకుఁడు. శూరాది పుత్రులుదయించిరి.
కౌశల్యయను పేరొకనామముకల కోశలదేశ రాజకుమారి
భద్రకు కేశియనువాఁడొక్కఁడే కులకీర్తి సుజ్ఞానము కావించు
వాఁడుదయించెను. రోచనకు హస్త హేమాంగదాది పుత్రులు
చాలమంది పుట్టిరి. ఇల, ఉరు, వల్కలాది వీరయాదవులను
గనెను ఇప్పటికాఱుగురు భార్యల వంశములు వచ్చివేసినవి.
ఇప్పుడు వసుదేవుని బెండ్లాడిన దేవకుని యేడ్గురుపుత్రికల వంశ
ములనుగూర్చి వినుఁడు.''

అందఱికంటెను పెద్దదగు ధృతదేవ గర్భము నుండివసు
దేవుఁడు మహాతేజస్వియును శూరవీరుఁడును, బలియునగు
విదృష్టయను పుత్రినిఁగనెను శాంతిదేవకు శ్రమ, ప్రతిశ్రుతు
లను ఇద్దరు పుత్రులుదయించిరి. ఉపదేవకు కల్ప, వర్షాదులు
పదిమంది క్షత్రియ రాజులుద్భవించిరి. శ్రీదేవకు వసు, హంస,
సుతశాదులాఱుగురు పుత్రులుదయించిరి. దేవరక్షిత తొమ్మిది
మంది పుత్రులనుగనెను. వారిలో గదుఁడు ముఖ్యుఁడు. సహా
దేవ యెనిమిదిమంది పుత్రులనుగనెను. వారష్టవసువులు పుత్ర
రూపమున నుదయించిరా యనునట్లుండెను. వారిలోఁ బురు,
విశ్రుతులను నిద్దఱును ముఖ్యులు

ఇప్పుడంటుకంటెం జిన్నభార్య దేవకియందు వసుదే వుఁడు ఏనిమిదిమంది పుత్రులను, ఒకపుత్రికనుగనెను. పుత్రిక అందఱకంటెఁజిన్నది ఆమె పేరు సుభద్రాదేవి. కీర్తిమంతుఁడు సుషేణుఁడు, భద్రసేనుఁడు, ఋజువు, సమ్మర్దనుఁడు, భద్రి, శేషావతారుఁడగు సంకర్షణుఁడు (బలరాముఁడు) వీరేడుగురును వసుదేవుని పుత్రులు.

శౌనకుఁడిట్లనెను:- "సూతా! వసుదేవుని యెనిమిదవ కుమారుఁడెవరు?"

నవ్విసూతుఁడిట్లనెను:- "అయ్యా స్వామీ! ఈగాథ యంతయును దేవకియొక్క యీయెనిమిదవ కుమారుని కొఱకే చేయఁబడినది. ఈదేవకీదేవియొక్క యెనిమిదవ కుమారుఁడు సాక్షాత్తుగఁ బరాత్పరుఁడగు వాసుదేవ భగవానుఁడు. ఈతని జన్మము శ్రావణబహుళ అష్టమి జన్మాష్టమినాఁడు జరిగినది. అజ, అచ్యుత, అవ్యక్త, అనాది, అచింత్యుఁడగు శ్రీహరి శ్రావణ బహుళాష్టమీ దినమున నర్ధరాత్రి యందవతరించి నాఁడు. ఆతని యవతారకథను నేనుముందు వర్ణింపఁగలను. మీరందఱును దత్తచిత్తులరై శ్రవణ మొనర్పుఁడు."



# శ్రీకృష్ణరూప - సుధకుమప్పు

(౭౧౧)

శ్లో॥ యస్యాననం మకరకుండల చారుకర్ణ
భ్రాజత్కపోల సుభగం సవిలాస హాసమ్
నిత్యోత్సవం న తతృపుర్దృశిభిః పిబంత్యో
నార్యో నరాశ్చ ముదితాః కుపితా నిమేశ్చ॥

శ్రీభాగ. ౯ స్కం. ౪ అ. ౬౫ శ్లో॥

చ॥ నగుమొగమున్, సుమధ్యమును,
నల్లని దేహము, లచ్చికాటప
ట్టగునురమున్, మహాభుజము,
లంచిత కుండల కర్ణముల్ మదే
భగతియు, నీలవేణియు గృపార దృష్టియుఁ గల్గువెన్నుఁడి
మ్ముగఁబొడసూపుఁగాఁకను
మూసినయప్పుడు విచ్చినప్పుడున్.

శ్రీమదాంధ్ర భాగవతము,

భగవానుని అవతారములన్నియును సుందరములే. అతనిచేష్టలన్నియును సుందరములే. అతఁడేరూపము ధరించి నను సుందరమే అతఁడు ధ రిం చి న వస్త్రాభూషణములును

నాతఁ డంగసౌందర్యములును సౌందర్యాతి సుందరము లైన భగవానుఁడు దేవతా, ఋషి, మనుష్య, తిర్యక్. పశు పక్షి, జలచర, నభశ్చర, భూచరాది సమస్త యోనులం దవతరించెను అందఱును నాతని రూపమునుగాంచి మోహితులై మమత్వమును మఱచిరి: కాని యీకృష్ణావతార మందు నాతఁడు సౌందర్యపరాకాష్ఠ నందుకొనెను ఇట్టి సుందర స్వరూపమిదివరకెన్నఁడును భూమిమీఁదకు రాలేదు అతఁడు తప్ప యింకెవరు నట్టిరూపమును ప్రకట మొనర్పఁజాలరు. స్థావర, జంగమ, చరాచరముల విషయమేల! అతఁడు స్వయముగ దనరూపమునుగాంచి ఆత్మవిస్మృతినిఁ జెందినాఁడు. అతఁడు తనరూపమును నద్దములోఁ జూచుకొని యిట్లనుకొనును:- ఓహో! ఇంతసౌందర్యము! నేను నిజముగ నింతసుందరముగ నున్నానా? చూడఁగా జూడఁగా నారూపము క్షణక్షణమును నూతన మగుచుండును. క్షణక్షణమాతఁడు దానిని మహా విస్ఫారితనేత్రములతోఁ గాంచును ఈసౌందర్య మెట్లున్న ఈమాధుర్య మెచ్చటినుండి వచ్చినది? అతఁడే తన రూపమును జూచుకొని విముగ్ధుడైన నిఁక మిగిలినవారిసంగతి చెప్పవలసినదేమున్నది? ఆయన రూపము నెవరు వర్ణింపఁగలరు ఆసౌందర్యమును గూర్చి సాధికారముగ నెవరు చెప్పఁగలరు మనమందఱము దాని ఛాయనుమాత్రమే చెప్పుచున్నాము.

సూతుఁడిట్లనెను:- "మునులారా! దేవకీదేవి అష్టమ గర్భమందు స్వయముగ నారాయణుఁడు బాలకృష్ణుఁడుగ ప్రభువు ప్రకటమైనాఁడు."

శౌనకుఁడిట్లనెను:- "సూతా! ఈ కోలాహల ఘోరమగు జగత్తంతయును ఈ దుఃఖపూర్ణమగు మర్త్యధర్మముగల మర్త్యలోకమునకు వచ్చి భగవానుఁ డవతరింపనేల?"

సూతుఁడిట్లనెను:- "స్వామీ! భగవంతునకు ధర్మమనిన సత్యాధికప్రియము ఆతఁడాతనికి హృదయజ పుత్రుఁడు. అధర్మము కూడ ఆతని వీపునకుఁబుట్టిన పుత్రుఁడైనను నాతని నాతఁడెన్నఁడుగ నాదరింపఁడు. భూమిపై పాపమెప్పుడభ్యుదయమును జెందునో, ధర్మము ప్రపంచమందెప్పుడు క్షయించునో అప్పుడు సర్వేశ్వరుఁడును సర్వాత్మయగు శ్రీహరి అనేక రూపములను ధరించి అవతరించును."

శౌనకుఁడిట్లనెను:- "సూతా! సాధు పరిత్రాణమును, దుష్కృత వినాశమును భగవదవతారమునకేకైక కారణమా?

సూతుఁడు నవ్వియిట్లనెను:- "కాదుస్వామీ! ఆతని అవతారమునకు యథార్థకారణము నెవరు చెప్పఁగలరు? దుష్ట వినాశనము, శిష్టపరిపాలనము ఆతని సంకల్ప మాత్రముననే జరుగఁగలదు. జీవులయొక్క ఉత్పత్తి, స్థితినాశనములాతని

మాయావిలాస కార్యములు. ఎవనియొక్క అహేతుకానుగ్రహముచే యీజనన మరణాదులు పూర్తిగా నివృత్తియగునో ఆత్మస్వరూపమును సుఖస్వరూప ప్రాప్తియునగునో అట్టివాని అవతారసంబంధమున ఇత్థంభూతమని చెప్పఁబూనుట దుస్సాహసమాత్రమును, అజ్ఞాతమును, మూర్ఖతయును గాఁగలదు''

ఆప్రభుని అవతార విషయములోఁ గొంచెముగఁ జెప్పఁదలచో. అతఁడు భక్తుల ననుగ్రహించుటకే భూమిపైనవతరించును తనయొక్క అనుగతాశ్రితుల యందనుగ్రహించుటకు తప్ప వేఱు నిశ్చితకారణము బుద్ధికి గోచరించుటలేదు. గోవు తనపొదుగునుండి పాలనొసంగుటకుఁ గారణము తన వత్సమునందుగల కృపయే. అది తన దూడమీఁదగల ప్రేమచేతనే పాలను బతుకును. చేపినయెడల నెవరైనఁ బిండుకొననిండు, త్రాగనిండు కొందఱు తమబలమును వృద్ధిపొందించుకొననిండు. తమయాత్మను దృప్తినిఁబొందించుకొననిండు, కొందఱు తమ పరాక్రమ వీర్యములను వృద్ధిపొందించు కొననిండు. గోవుయొక్క దృష్టిమాత్రము వత్సముమీఁదనే యుండును. తల్లి పాలపై ప్రధానమగు నధికారము వత్సమునకే.

కలియుగములోఁ బుట్టు జీవులత్యంత దీనులుగనుందురు. వారు దుఃఖితులుగను, శోకయుక్తులుగను నుందురు. ఎవరిని ధ్యానించినవారి దుఃఖములును, శోకములును దూరమగునో

యని యీభక్తవత్సలుఁడగు భగవానుని చింత. అతఁడిట్లనుకొ నెను:- "అల్పమున సుఖము లేదు. క్షుద్రమున సుఖము లేదు. వినాశకరమగు వస్తువులలో రసము లేదు. ఏల నేనే యద్భుత రూపమును ధరించి యీ దుఃఖితక్లాంత జీవులమధ్య సంచరిం పఁగూడదు? ఏల నేనే నా యపార సౌందర్య, మాధుర్య, లావణ్యములను జూపించి వీరిచే శాంతిసుఖము పానము చేయిం పఁగూడదు? నా రూపమును ధ్యానించి అనంతకాలము వఱకును జీవులు సుఖశాంతుల ననుభవించెదరో వారి క్లేశములు, దుఃఖ ములు, శోకములు, సంతాపము, ఆధి వ్యాధులు- మొదలగు నవన్నియును నాత్యంతిక నాశము గాఁగలవు. నా యశోరూ పామృతమును కర్ణపుటముల ద్వారా ప్రేమపూర్వకముగఁ బానమొనర్చుటచే ప్రాణులీ భవసాగరమును పరిశ్రమ మొన ర్పకయే దాటఁగలరు" ఇట్లన్నియు నాలోచించుకొని యాతఁ డజ్ఞాన నివృత్తి నిఁగావించుఁదన పరమ పవిత్ర సుయశమును ప్రపంచమునందు వ్యాపింపఁజేసెను. తనయొక్క త్రైలోక్య మోహనమూర్తిని బృథివియందు ప్రాదుర్భావముగావించెను ఏయనుపమరూపమును సాక్షాత్తుగ దర్శించుటచేతను లేక ధ్యాన మందు దర్శించుటచేతను జీవుఁడు సమస్తాశుభములనుండియుఁ దత్కాలముననే బయటఁబడఁగలఁడు. అతని యశోరూపమగు పవిత్ర తీర్థమునందవగాహన మొనర్చు సాధుజనులు, దానిని దమ కర్ణపుటములతోఁ బునఃపునః పానమొనర్చు ప్రణతపురుషులు

మోక్ష ప్రతిబంధకమగు గర్మవాసనను దత్కాలముసందృ జించి సంసారబంధమునుండి శాశ్వతముగ విడిపడుగుదు. మాటి మాటికని(బానము చేయలేనివారును ఒక్కసారి శ్రీహరి యశో మృతమును శ్రోత్రియసవమగు నంజలితో నాచమనము మాత్ర మొనర్చినచో( గల్యాణము కలుగును.

ఈ శ్రీకృష్ణావతారమందు భగవానుడు గొప్ప గొప్ప చరితమధుర త్రైలోక్యపావనములగునట్టియు హృదయమునకును నింద్రియములకును సుఖమొసంగునట్టియు క్రీడలనొనర్చినాడు అవి ముక్తులకును, ముముక్షువులకును, సత్పురుషులకును, బద్ధజీవు లకును నానందము నొసంగునవై యున్నవి. జ్ఞానులకును, వీరు లకును, ఇంతరోల సాంసారిక విషయాసక్తులకును నాలీలలు బాగుండును. ఆసమయమున న సు ర లు రాజులరూపమున భూమిమీద( నవతరించిరి. అక్షౌహిణీల కొలది సేనలకు వారు ప్రభువులైరి. వారు గొప్ప దుస్సాహసులును, అభిమానులును గూరులును, తపోనిరతులునై యుండిరి, వారి సేవను జంప( జాలకుండిరి. ఏలననగా వారికితపోబలమును గలదు భగవం తుడు తప్ప యిట్టి సామర్థ్యయుక్తులగు గూరకర్ముల సేనను వధింప(గలరు? పృథివి వారి భారముచే నాక్రాంతమైయుండెను ఆమెదీనవాక్కులతో విశ్వంభరునకు విన్నవించెను. అంద అహృదయములలో నుండి అ ం త య ని యామకుడును, గోబ్రాహ్మణ ప్రతిపాలకుడును, బ్రహ్మణ్యదేవుడును, గో

పాలుఁడగు భగవంతుఁడు భూభారమును హరించునిమిత్తమై తన యన్నయును శేషావతారుఁడునగు సంకర్షణునితోఁగూడి యవతరించి మధుసూదనుఁడు దేవేశ్వరగణమును సంతోషకరణముతోనైన సాహింపఁజాలని కఠినకార్యములను గూడ నొనర్చెను

స్వామీ! ఎవనియొక్క లావణ్యమయములగు లలిత లీలలను భోజవంశీయులు వృష్ణివంశీయులు, అంధకవంశీయులు మధువంశీయులు, శూరసేన దశార్హ, కురు, సృంజయ. పాండువంశములలోని వీరులు నిరంతరము గానమొనర్చుచుందురో. వానిని గీర్తించుచుందురో ఆ శ్రీహరి తనచేష్టలచేఁ బ్రపంచమును తృప్తిఁ గావించినాఁడు. అతఁడొక సత్యసుఖమార్గమును జూపించినాఁడు. అతఁడు తనస్నేహయుక్త మంద మంద మధుర మందహాసముచేతను, వయ్యారముచేతను, ప్రేమప్రసాద పూర్ణమును, విలాసమయమునగు వాక్కుల చేతను. బల, విక్రమ, సాహసమయమగు లలితలీలలు చేతను, త్రైలోక్యపావన భువనమోహన సర్వాంగసుందర సుఖమయ సుదృశ్య స్వరూపముచేతను నృలోకమును రమింపఁజేసినాఁడు. దానినానందింపఁ జేసినాఁడు. ఆ శ్రీహరియొక్క సమస్తాంగములయొక్క వర్ణనము మునులారా! ఎవరుచేయఁగలరు? కేవలము మచ్చునకు, రస రసాస్వాదమొనరింపఁ జేయుటకై నేనాతని యనుపమ సుఖమునుగూర్చి యత్కించిత్తుగ వర్ణించి అభిమానపడి నాతని లలితలీలలను సంక్షేపముగఁజెప్పెదను

మునులారా! కొంచెము సేపు మీరు దుగ్ధఫేనమువలె స్వచ్ఛమును, కమలమువలె వికసితమును, కమలమువలె సరసములగు నేత్రములను మూసికొని శ్రీకృష్ణుని సౌందర్య మాధుర్యయుక్తమగు నాననమును ధ్యానింపుఁడు.'

శౌనకుఁడిట్లనెను :- " సూతా! నీవుమాటిమాటికిని ఆననము ఆననమనుచున్నావు. శ్రీకృష్ణుని ముఖకమలమును నీవు ముఖారవిందము, చంద్రవదనము మొదలగు శబ్దములతో నేల వర్ణింపవు?"

సూతుఁడు నవ్వుచు నిట్లనెను :- "ఆననమనుట కనేక హేతువులుకలవు. ఆననమనుట కభిప్రాయమేమనఁగా నీముఖమును సర్వసాధారణ ముఖమనుకొని చూచుచు రావలదు. సంభాళించుకొనుచు రావలయును. ఇది యగాధరస సాగరము ఇచ్చటకు రాఁగానే నిమగ్నులైపోయి మునిఁగిపోవుదురు. తావున ఆ=రండు న–న=వద్దు, వద్దు, రా వద్దు లే'' (ఆ+న+న.)

ముఖమునుజంద్రునకును, గమలమునకును బోల్చినచో నా యుపమానములన్నియును నీచోపమానములు కాఁగలవు "అపమన్నాత్ న–న" అనఁగ నిచ్చటఁజంద్రుఁడును నిలువఁడు కమలమును నిలువదు దీని నుపమానరహితమైనదిగ ననఁగా ననుపమానమైనదిగఁ దెలిసికొని కేవలము ఆనన' మనియే యుపచారముగఁ జెప్పఁబడినది.

ఆతని దర్శనముచేతనే వ్రజ జీవులకు నలువైపులను చేష్టలు కలుగును అన్నియు నారూపమాధురి నవలోకించుచు నిలిచిపోవుచుండును, "ఆసమన్తాత్ ఆననం-చేష్టనం-యద్దర్శనేన వ్రజజీవానాం తత్ ఆననం" ఈవిధముగ నీయానన శబ్దము బహ్వర్థవాచకమై యున్నది. కావున మాగురుదేవుడే విశేషణమును బ్రయోగింపకయే దీనిని ఆననమని చెప్పియుండిరి దీనికి నేను శాస్త్రీయ వివేచనమును గావింప నారంభించినచో మీరాయుండలు నోళ్ళతో నానిపోయెదను. జీవునకు ఆననమందే లీనమగుట పరమపురుషార్థమైనను ఈనేత్రములసార్థకత యెట్లు? కాని నేత్రములకే ఆహారమిచ్చుటయును ధర్మము కాదు, పాపమీకర్ణము లెంతో తృష్ణను జెందియున్నవి, ఇవి శ్రీకృష్ణ గుణశ్రవణలోలుపులై యిప్పటినుండియో మాతలు లేక తెలుచుకొనియున్నవి. కొంచముగ వీని విషయమును గమనింపుడు. వీనిని గూడ యశోమృతపానమును గావింపనిండు అందువలన నిష్పాడాననముయొక్క అర్థమును జెప్పక, నేను ఆననము యొక్క కొంచెము మధురపాకమును రుచిచూపించి దాని మచ్చును జూపించితిని. శ్రుతిమధురమును నత్యంత కర్ణప్రియమునగు శ్రీకృష్ణచరిత్రమును జెప్పెదను."

శౌనకుడిట్లనెను:- "సూతా! ఆసమంతాత్ ఆననం= ఆననమ్ లేక ఆ సమన్తాత్ న-న ఆననం ఈవ్యాఖ్యలలో మాకేమియును నానందము కలుగుటలేదు నీవు మాకా యనుపమాననము యొక్క మానసిక దర్శనమునుగావింపుడు."

సూతుఁడిట్లనెను :- "అయితే స్వామీ! నేత్రములను మూసికొనుఁడు. ధ్యానమొనర్పుఁడు శిరస్సున నెమలిపింఛ మొకటి యున్నది. నల్లనల్లని యుంగరములు తిరిగి వ్రేలాడుచున్న కుటిలకుండలములు కదలుచుఁ గపోలములకు వ్యంజన మొనర్చుచున్నవి. అర్ధస్ఫుటితములగు నీలకమలములవలెనున్న కర్ణములు కొంచెముగఁ గేశములచేఁ గప్పబడినవి. క్రిందిభాగ మునఁగల ఛిద్రములందు మకరాకృతములగు గమనీయకుండలములు వ్రేలాడుచున్నవి. ఆకుండలములు కర్ణములకేకాదు. కపోలములకును శ్రీవృద్ధినిఁగావించుచున్నవి. గుండ్రని నద్దములవలెనున్న లోలకపోలములు కుండలముల కాంతిచేతను, నేత్రరశ్ముల తళుకులచేతను, కుటిల కేశముల ప్రభచేతను వికసించినట్లుండెను. దొండపండువలె నెఱ్ఱఁగను, అత్యంత నునుపుగను రసభరితములైన నధరములమీఁద మందహాసపుచులు వెలిగ్రక్కుచుండెను; అది బందూకపుష్ప కళికపైఁ జంద్రరశ్ములు జాలిగ్రక్కుచున్నట్లును, పిల్లవాయువులువచ్చి దానిని హాసింపఁ జేయుచున్నట్లు రసయుక్తములును, లజ్జాయుక్తములుగను, మధురమయములగు నోష్ఠములు కదలుచుండెను. కమలద్వయమువంటి నేత్రములందలి కటాక్షబాణములను భ్రుకుటీరూపమగు ధనుస్సునందు సంధించి దర్శకులను గొట్టుటకువక్రమించుచున్నట్లుండెను. ఇట్టి యా శ్యామసుందర, మదనమోహన ఆనందకందుఁడగు వ్రజనందనుని శ్రీకృష్ణచంద్రుని ముఖారవిం

దము నవలోకించి, దానియొక్క మధురమకరందమును దన నయనపుటములద్వారా యథేష్టముగఁ బానమొనర్చి నరనారులలో, వివాహితులు గానిండు, అవివాహితులు గానిండు. త్యాగు గానిండు, విరాగులు కానిండు, ఘోరసంసారులు కానిండు —ఎవరైనను నెన్నఁడను దృప్తినిఁ జెందరు. రెప్పలను వాల్పక ఆ జేపటిగ నా సాకారరూపరాశియగు నాననమును జూచుచుందురు— కాని మధ్యలో రెప్పలు ప్రతిబంధకములుగనున్నవి. నిమేషోన్మేషములచే దర్శకులకు వ్యవధానము కలుగుచున్నది. అందువలన నందఱును దమకను ఱెప్పల కధిష్ఠాతృదేవుఁడగు నిమిని తమదర్శనమునకు విఘ్నము కలిగించు చున్నాఁడనియుఁ, గను ఱెప్పపాట్లను గొట్టి అంతరాయమును గలిగించు చున్నాఁడనియును దిట్టుచుందురు. ఈ దౌర్భాగ్యుని దొలఁగించుఁడు, ఈతని మాకనుఱెప్పలలోఁ గూర్చుండనీయకుమని విధాతకుఁ జెప్పుకొందము. ఈతఁడు కూర్చుండ వలసివచ్చెనో మేము శ్రీకృష్ణరూప సుధాపానము నొనర్చునప్పుడు కూర్చుండ నిమ్మనిమొఱ పెట్టుకొందము.” 294 · 592

ACC NO - 1154 · PRA

సూతుఁడిట్లనెను:— “మునులారా! నేనెంతని చెప్పఁగలను? భగవానుని సౌందర్య మాధుర్యములకథనీయములు. ఒక్కసారి దానినిఁ జవిచూచిన భాగ్యశాలులే దాని మాహింపఁగలరు. అప్పుడు ప్రపంచములోని సమస్త సౌందర్యములు నిస్తేజములు, నీరసములై పోవును. మహాభాగా! ఇప్పుడు నేను శ్రీకృష్ణ చరిత్రము నారంభించెదను. మీ రందఱును సావధానులరు కండు.”

సమాప్తి.